# ఇన్‌క్రిమిన్ బాలలు

## కేవలం పెద్దగాకాదు, ఎంతో చక్కగా పెరిగే పిల్లలు!




ఇన్‌క్రిమిన్ టానిక్ పెరిగే వయసులో ఎంతో పెద్ద...పెద్ద తేడాను తెస్తుంది. నిజానికి అసలు విషయం ఏమిటంటే ఇన్‌క్రిమిన్ టానిక్ ఇతర టానిక్‌లకన్న ఓ మెట్టు పైనుంది. ఎందుకంటే, ఆరోగ్యమైన పెరుగుదలకోసం అత్యవసరమైన విటమిన్లతోపాటు ఇన్‌క్రిమిన్‌లో లైసిన్ కూడా ఉంది గనక. ఆ లైసిన్ ఆకలిని పుట్టిస్తుంది. పిల్లలు చక్కగా పెరగాలంటే బాగా తినాలన్న మాట ప్రతి తల్లికీ తెలుసు. ఈ ఇన్‌క్రిమిన్ అలా బాగా తినే ఆహారాన్ని మేలైన పెరుగుదలకు తోడ్పడేలా మారుస్తుంది మరి.

Lederle ఉత్పాదన
*అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.




## ఇన్‌క్రిమిన్* టానిక్

తినేమంచి ఆహారాన్ని తీరైనపెరుగుదలగా మారుస్తుంది.

Sista's-INC-973/80 Tel F

## లోకంపోకడ * డోరిమెన్

అన్నిరకాల విదేశీ దురాక్రమణలను విరోధించడానికి ఆసియా దేశాలన్నీ ఒకటిగా ఉండాలి

చక్కటి నిజం చెప్పారు మరైతే ముందుగా మీరు దురాక్రమణ చేసిన మా భూభాగం నుంచి తప్పుకుని మిగతా వారందరికీ మార్గదర్శకం కండి.

మహా కాయుడు మరుగుజ్జు కథల్లో ఒకటి గుర్తొస్తూంది. మెప్పులన్నీ మహాకాయుడికి దక్కితే, చెప్పుదెబ్బలన్నీ మరుగుజ్జుకి లభించాయట

అమెరికా

అమెరికా ఆయుధాలని పాకిస్తాన్ దుర్వినియోగం చేస్తే ఏమవుతుంది

అదినాకు అనవసరం. కోట్లాది ధనం సంపాదించడమే నా లక్ష్యం.

అమెరికా ఆయుధ వ్యాపారులు











# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభు ప్రసాద్
సంపాదకుడు
[1938 1972]

శుక్రవారం : 17-7-'81
దుర్మతి నామ సం. ఆషాఢ శు. పూర్ణిమ
సంపుటము 74 సంచిక 44

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 67-60
ఆరు మాసాల చందా రు. 33-80
విడిప్రతి వెల రు. 1-25 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ
నటి కల్యాణి అయ్యర్
(ఫోటో : జగన్మోహన్)

**కథలు**



**సీరియల్ కథలు :**



**వ్యాసాలు, శీర్షికలు :**

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ముఖ చిత్రాలపట్ల మీరు తీసుకుంటున్న శ్రద్ధ చాలా బాగుంటోంది. రాగజ్వాల సీరియల్ మంచి ఇంట్రస్ట్‌గా ఉంది. చిట్టారెడ్డి సూర్యకుమారిగారికి మా ధన్యవాదాలు. మా అభిమాన హీరో "కృష్ణ"గారి ముఖ చిత్రం ప్రచురిస్తారని ఆశిస్తున్నాము. 26.6.81 పత్రికలో వెలువడిన "అరుణ కోరిక" కథ చాలా బాగుంది.

ఉమా ప్రకాశ్, సూర్యకుమారి (ఉండూరు)

* * *

ఈ మధ్యనే వివాహితయై శ్రీమతిగా మారిన నటి దీపను క్రిందటి వారం సంచికకు ముఖచిత్ర తారగా ఎంపిక చేయడం సందర్భోచితంగా బాగుంది. 'లల్లీ మధు' కథ నచ్చింది. పని మనిషి నరసమ్మ, ఇరుగు పొరుగు అమ్మలక్కల్లాంటి లక్ష్మి మున్నగు పాత్రల ద్వారా భార్యాభర్తలిరువురూ ఉద్యోగులే అయినా వారిమధ్య అపోహలు, కీచులాటలు తగవనీ, ఉభయులూ పరస్పర అవగాహన కల్గి ఉన్నప్పుడే వారి దాంపత్య జీవితం సాఫీగా కొనసాగుతుందనే విషయాన్ని రచయిత సాధ్యమయినంతక్లుప్తంగా చెప్పినతీరు అభినందనీయం. తాను చెప్పదలుచుకున్నది సూటిగా చెప్పినప్పుడే రచయిత తన ప్రయత్నంలో కృతకృత్యుడవుతాడు. ఇక ముందు కూడా ఇలాంటి చిన్న కథలను అధికంగా అందిస్తూ పాఠకుల మన్ననలు అందుకోవాలని ఆంధ్ర సచిత్రవారపత్రిక అభిమాన పాఠకుడిగా నా ఆశ, ఆకాంక్షనూ.

కె. హెచ్. రావు (షక్కర్‌నగర్)

## పూమెన్

రోజు రోజుకు కొత్త రూపుల్ని సంతరించుకుంటున్న దేశ, అంతర్జాతీయరాజకీయాలు కేవలం పేపర్ వార్తలతో చదివిఅర్థం చేసుకోవడం కష్టమే! అలాంటిది ప్రతి వారంకొన్నేళ్ళనుండిలోకం పోకడలో పూమెన్ గారు మామూలు ప్రజలకి కూడా అర్థమయ్యే క్షుద్ర రాజకీయాన్నంతా తన చిన్న వ్యాఖ్యతో చక్కని బొమ్మలతో జోడించడం నిజంగా గొప్ప విషయం. ఇందుకు శ్రీ పూమెన్‌గారికి మా అభినందనలు.

ఈ వారం ముఖచిత్రం దీప తన మొదటి అందాన్నంతా పోగొట్టుకున్నట్టనిపించింది.

కె. రమాదేవి, రంజిత [హైదరాబాద్]

## గుణాపూరు

ఈ వారం వారపత్రిక రాగజ్వాల చాల యింటరెస్టుగా యున్నది. ముఖ్యముగా నౌపడా - గుణుపూర్ రైలు మార్గం, యింజను ఫోటో చూస్తూంటే ఒక వింత అనుభూతి కలుగుచున్నది. చిన్న పిల్లల బుల్లిబండిలా కనిపించుచున్నది. ప్రపంచములో ఎనిమిదవ వింతగా దీనిని పోల్చవచ్చును.

వి. సుజాత (విశాఖపట్నం)

## ఓ పాఠకుని లేఖ

మీ పత్రికను (ఆంధ్ర సచిత్రవారపత్రికను) ప్రతివారం అభిమానంతో చదువుతున్న వేలాది పాఠకుల్లో నేను ఒక్కణ్ణి. కాని నా లెటర్లను మీరు ఒక్కసారి కూడా ప్రచురించలేదు. అయినా లెటరు వ్రాస్తున్నాను- కనీసం ఒక లెటరుఅయినా ప్రచురించమని. ప్రస్తుతంనాకు భాధ-మీపట్ల కోపం కలుగుచున్నాయి.

సి. గంగాధర (ధర్మవరం)

## సీరియల్

చిట్టారెడ్డి సూర్యకుమారి కలం నుంచి వెలువడుతున్న 'రాగజ్వాల' సీరియల్ నన్నెంతగానో ఆకర్షించింది. ఇంతవరకు నడిచిన సీరియల్, అంటే మూడు వారాలపాటు సాగిన ఈ సీరియల్ అధికభాగం కేవలం ఇద్దరు ప్రేమికుల మధ్యే సాగించిన తీరు అద్భుతం. ఎంతో చేయి తిరిగిన రచయిత్రి కాబట్టే ఆ విధంగా మలిచారు. అంత స్వీట్‌గా, మనోరంజకంగా సాగించిన తీరు, సంభాషణ మరుపురానిది. అందుచే రచయిత్రికి నా అభినందనలు తెలియజేయండి.

కుమారి కొమ్మూరి పద్మలత (గుంటూరు)

(66 వ పేజీ చూడండి)

# 90 సంవత్సరాలైనా రిటైరవ్వని మహిళ!

విలెనా ఉసోల్ట్సేవా లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరు. ఆమె వయస్సు 90 సంవత్సరాలు. ఆమె వృద్ధాప్య పింఛనీతో రిటైరైనప్పటికీ, ఇంకా పనిచేస్తూనేవుంది. ఆమె లెనిన్‌గ్రాడ్ నగరంలో మణికట్టు శస్త్ర చికిత్సా కేంద్రాన్ని నిర్వహిస్తూ వుంది.

మరో వ్యక్తి అలెక్సీ గెరాసిమోవ్. ఆయన వయస్సు 68 సంవత్సరాలు. ఆయన సోవియట్ ఉత్తరాది నగరమైన అరాంజెల్స్క్ నగరంలో బుక్ కీపర్. ఆయనకు ఉద్యోగ విరమణ వయస్సు వచ్చినప్పటికీ, పనీపాటా లేకుండా కూర్చోరాదని నిర్ణయించుకున్నాడు. ఆయన బిర్చి వృక్షపు నారతో వివిధరకాలైన వస్తువులను నేస్తున్నారు. ఆయనకుచిన్నప్పటి నుండీ ఈ వృత్తిపై ఎంతో మక్కువ. ఆయన తయారుచేసిన వివిధరకాలైన అలంకరణ సామగ్రి ఆయన గృహంలో అలంకరింపబడి వుండడమేగాక, మార్కెట్‌లో మంచి గిరాకీతో అమ్ముడవుతూ వున్నాయి. 'బైలో-మోర్స్కియే ఉజోరీ' హస్తకళా సంస్థ ఈ వస్తువులను కొనుగోలుచేస్తూ వుంది.

సోవియట్ యూనియన్‌లో మహిళలు 55 వ ఏట, పురుషులు 60 వ యేట పింఛనీకి అర్హులు. భూగర్భంలోనూ, కర్మాగారాలలోనూ లేదా ఇతర కష్టమైన వృత్తులలోనూ పనిచేసేవారూ, దుర్భరమైన వాతావరణ పరిస్థితులలో పనిచేసేవారూ 5 నుండి 10 సంవత్సరాలు ముందుగానే పింఛన్ తీసుకోనవచ్చు. సోవియట్‌లో పింఛనీలు జీతంలో 50 మొదలు 100 శాతం వరకూ వుంటాయి. పింఛనీ ఆదాయంపై పన్ను లేదు.

వృద్ధాప్యం వల్లనో, ఆరోగ్యకారణాల వల్లనో అనేకమంది వృద్ధులు రిటైరైన పిమ్మట ఇండ్లలోనేవుండి, తమ మనుమసంతానం బాగోగులు చూసుకుంటూ తమ బిడ్డలకు సహాయంగా వుండిపోతారు. తీరిక వేళల్లో తమ అనుబంధ కమతాలు మున్నగు వానిలో తాము చేయగలిగినంత పని చేస్తూ వుంటారు. అయితే అనేకమంది శారీరకంగా దృఢంగా వున్నామని భావించేవారు తమ వృత్తులలో కొనసాగుతారు. అయితే వారు పూర్వం చేసిన వానికంటే సులభమైన వృత్తులను ఎంచుకుంటారు. దీనిని సోవియట్ ప్రభుత్వం బాగా ప్రోత్సహిస్తూ వుంది. సోవియట్ చట్టాల ప్రకారం, పనిచేసే పింఛనీదార్లు తమ వేతనాలవేగాక, పింఛనీలో కొంత మొత్తాన్ని కూడా పొందుతారు. పింఛనీదార్లు సేవారంగంలోగానీ, లేదా చట్టం నిర్దేశించిన ఆర్థిక రంగంలోగానీ పనిచేస్తే, వారికి వారి వేతనాలతోపాటు, పూర్తి పింఛనీ లభిస్తుంది.

# నర్సింగ్‌హోం

శ్రీరంగం

సీరియల్ ప్రారంభం



డాక్టర్ రాజా ఎం. డి. పూర్తిచేసేటప్పటికి చాలా వదంతులు వ్యాపించేయి. 'అతను బాస్‌కి బానిసలా చాకిరీ చేసేడనీ, లేదు పొక యిరవై వేలదాకా డబ్బు ఎగ్జామినర్‌కి ముట్టచెప్పేడనీ, యివన్నీలేదు — అతను చాలా సిన్సియర్, బ్రిలియంట్ స్టూడెంటనీ! అతను పాస్ కావడం అతిమామూలుగా పాస్‌కాలేదు! ఎం. డి. లో గోల్డ్‌మెడల్ తెచ్చుకున్నాడు. ఎగ్జామినర్ ఏందుకో పక్షపాతం చూపించే డన్నారు. దీనికి అసలు కారణం— అతను హాస్పిటల్‌లో అతనిబాస్‌ని అతిగా మన్నించడం!

'రాజా! నాకూ చదివించాలనే ఉంది. కాని పరిస్థితులు మనకు అనుకూలంగా లేవు' అన్నాడు.

పరిస్థితులు అంటే అప్పటిదాకా నాకు ఏంటో అంత బాగా తెలియదు, అతను చెప్పినా నాకు అర్థంకావు. నాకు అర్థం అయ్యేది 'చదువు' అన్నమాట వొక్కటే.

ఏవరు ఏం అనుకున్నా అతను చాలా సంతోషపడ్డాడు-గోల్డ్ మెడల్ కొట్టేసేసనీ. పోరట్లు అవగానే అతనికి రిజల్టు తెలిసినా, పేపర్లో వచ్చేదాకా వోపికపట్టి పేపర్లో రాగానే చిన్న పార్టీ చేసేడు.

పార్టీలో అతని ఛీఫ్ డాక్టర్ గోవర్ధన్, రాజాని అభినందించి 'నీ భవిష్యత్తు ప్లాన్సేంటి?' అంటూ ప్రశ్నించేడు.

అతను ఫారిన్ విస్కీ సిప్ చేస్తూంటే, రాజా మామూల్మాలు కూల్ డ్రింక్ తాగుతూ 'నేను యింకా నిశ్చయం చేసుకోలేదు సార్' అన్నాడు.

'అట్లా అయితే యిప్పుడు నిశ్చయం చేసుకుని, నా అసిస్టెంటుగా చేరు నా పలుకుబడి వినియోగించి నీకు నా దగ్గరే పోస్టింగ్ వచ్చేటట్లు చేస్తాను.'

'ఆలోచిస్తాను సార్.'

'ఆలోచించుకోడానికి ఏం వుందోయ్ రాజా?' అంటూ రెండో రవుండ్ గ్లాస్ ఖాళీ చేస్తూ అడిగేడు.

'నేను యిక్కడ ఉద్యోగంలో చేరేముందు యింటిని గురించి ఆలోచించాలి సార్' అన్నాడు.

'ఏంటి నీ యింటి సమస్య?' అతని మంచి కాంక్షించే స్వరంతో అడిగేడు డాక్టర్ గోవర్ధన్.

ఏం. డి స్టూడెంటుగా అతని చేతిక్రింద రెండేళ్ళనించి ఉంటున్నాడు. అతనికీ, రాజాకు- యిన్నాళ్ళనించి ఉన్న సంబంధం వొక టీచరుకూ, స్టూడెంటుకు మధ్య ఉన్న సంబంధం మాత్రమే! వాళ్ళిద్దరూ ఎప్పుడు మాట్లాడినా కేసుల గురించి, మామూలు కేసులలో ఎక్సెప్షన్స్ గురించి, పాత జబ్బుల గురించి, క్రొత్త థీరీలు- యివి తప్పితే రాజా కుటుంబం గురించి, అతని సమస్యల గురించి అడిగే అనువైన వాతావరణం యీ రోజు దాకా కలగలేదు.

''సార్ మాది పెద్ద కుటుంబం. మా నాన్న పల్లెటూరో ఆర్. ఎం. పీ డిగ్రీ తీసుకుని వైద్యం చేస్తున్నారు. మేము మొత్తం ఆరుగురం. అందరిలో పెద్దవాణ్ని నేనే! మాకు రెండెకరాల పొలం కూడా ఉంది. దానిమీద వచ్చే ఆదాయంతో, మా నాన్న వైద్యంమీద సంపాయించే డబ్బుతో - కాలం వెళ్ళబుచ్చుతున్నాం. ఏదో పల్లెటూరో ఉండే స్కూల్ యిచ్చిన చదువు చదివేవాళ్ళం. ఆడపిల్లలు యింట్లోనే వుండి అమ్మకు చేదోడు వాదోడుగా ఉండేవాళ్ళు - కాని మొగ పిల్లలం మాత్రం స్కూలుకు వెళ్ళి వచ్చేవాళ్ళం. అందరిలోకి నాకు మార్కులు బాగా వచ్చేవి. ఆ స్కూలు హెడ్మాష్టరుకు నేనంటే చాలా యిష్టం. నాకు చాలామంచి భవిష్యత్తు ఉందనీ కలలు గనేవాడు. అతని బలవంతం తోనే నేను స్కూల్ ఫైనల్ పరీక్ష కూడా పాస్ అయ్యాను. నా తరువాత వాడూ, ఆఖరి వాడు అత్తెసరు మార్కులతో తొమ్మిదీ, ఎనిమిదిలో ఉన్నారు.

'నేను స్కూల్ ఫష్టు వచ్చేను' అని తెలుసుకున్న రోజు మా నాన్న చాలా భయపడ్డాడు. నా తత్వం గురించీ, నాకు చదువులో ఉండే ఆసక్తి గురించీ అతనికి బాగా తెలుసు. ఇంట్లో అందరూ సంతోషంగా ఉన్న ఆ రిజల్ట్స్ వచ్చినరోజు అతను దిగులుగా కూర్చున్నారు, తన నులకమంచంలో. ఆ రాత్రి భోజనాల తర్వాత నేను మెల్లగా అతన్ని చేరి 'నాన్నా' అన్నాను. ప్రశ్నార్థకంగా నా వైపు చూసేరు.

'నేను తర్వాత చదువులు చదవాలనుకుంటున్నాను నాన్నా' అన్నాను. అతను ఏం మాట్లాడలేదు.

తిరిగి నేనే, 'నాన్నా! నాకు స్కూల్ ఫస్ట్ వొచ్చింది. హెడ్మాష్టరు నన్ను చూసి పొంగిపోయేరు. నేనేగాని యింకా చదివితే నాకు చాలామంచి భవిష్యత్తు ఉందన్నారు. ఏం నాన్నా! చదివిస్తావా?'' అంటూ అడిగేను. అతను నావైపు చాలా దీనంగా చూస్తూ, 'రాజా' అంటూ మరీ ఆర్తిగా పిలిచి




అయినా అర్థం చేసుకోనేందుకు ప్రయత్నిద్దామని 'ఏంటినాన్నా! మనకు అనుకూలంగా లేదు' అన్నాను.

'ఏంటోరాజా, మన వ్యవసాయం, యీ వైద్యంమీదవచ్చే రాబడి, మన తిండి బట్టకే సరిపోతోంది. దీనికితోడు మనకు ఆడపిల్లలు ఉన్నారు, వాళ్ళకు పెళ్ళి చేయాలా? మెట్రిక్యులేషన్‌దాకా యిక్కడే ఉందనీ, ఏంఖర్చు లేదనీ నిన్ను చదివించేను. ఇప్పుడు నీ చదువు అయిపోయింది కాబట్టి, నీకు వైద్యంనేర్పించి నీచేత చిన్న డిస్పెన్సరీ వేరే పల్లెటూర్లో పెట్టిస్తే-నాకు కొద్దిగా డబ్బు యింటికి సర్దుబాటు అవుతుంది' అన్నాడు.

నా భావాల్ని బలంగా మా నాన్న వినేటట్లు ఎలా చెప్పాలో నాకు తెలియలేదు. బాధతో భారంగా వెళ్ళి పక్కమీద పడుకున్నాను. ఈ రోజు నిద్ర తొందరగా వస్తే బాగుండేది, అనిపించింది నాకు. రెండు దాకా నిదుర ఎడంగా జరిగింది. ఎలాగయితేనేం— గంట తర్వాత గంట విన్న నేను రెండు దాటిం తరువాత నిదురలోకి జారుకున్నాను.

మరునాడు వేలసిపోయిన ముఖంతో, దిగులుకి ప్రతీకగా హెడ్మాష్టర్ని కలుసుకుని తండ్రికీ తనకూ మధ్య జరిగిన సంభాషణ చెప్పి, 'మీరైనా ప్రయత్నించండి' అన్నాను.

'సరే, మీ నాన్నతో మాట్లాడుతానులే! నువ్వు దిగులు పడకు' అన్నాడు హెడ్ మాష్టరు.

హెడ్మాష్టరు అన్నట్లుగానే అతను మా యింటికి వచ్చి నా ముందే మా నాన్నతో మాట్లాడేడు. వొప్పించేందుకు చాలా ప్రయత్నించేడు గంటన్నర మాట్లాడింతరువాత చివరకు తేలిందేమిటంటే నేను నాకు కావలసిన భవిష్యత్తు పొందేందుకు అతను అన్ని విధాల సహాయ పడ్డాడనీ, కాని తన చదువు గురించి తన తమ్ములు స్కూల్ ఆపి వాళ్ళని పనిలో

చేర్చవలసివొస్తుందనీ- లేకపోతే కాలేజీకయే ఖర్చులు పట్నంలో తట్టుకోలేమనీ అన్నాడు తండ్రి.

చదువుకోవాలనే ఉత్సాహంతో నేను ఆలోచించుకోలేకపోయేను 'సరే' అని అన బోయేను.

తన తండ్రే 'నీవు తలూపేముందు వొక సంగతి ఆలోచించు, వీళ్ళ భవిష్యత్తు నీ వొక్కడిగురించి నిలిపేస్తున్నాను వాళ్ళందరికీ అయేడబ్బు నీ వొక్కడికే పెట్టవలసి వస్తూంది. రేపు నీవు మంచి చదువులతో పైకి వొచ్చి- హోదాలో ఉన్నప్పుడు నీవు వాళ్ళను ఆదుకోవడమూ, అవసరాలు తీర్చ డమూ చేయవలసి వొస్తుంది అది నీకు సమ్మతమేనా?' అంటూ అడిగేడు.

తిరిగి నేను తలూపబోయేను. 'బాగా ఆలోచించి చెప్పు! నీ చదువు పూర్తయి నీకు ఉద్యోగం వచ్చే సమయానికి, నీకు పెళ్ళి వయసు వొచ్చేయొచ్చు. పెళ్ళి చేసుకున్న తర్వాత నీ భార్య నిన్ను అడ్డు పెట్టొచ్చు. అప్పుడు నీ యిబ్బందులు మొదలవుతాయి.' నాకు ఆలోచించే వోపికా, అంత వయసూ రెండూ లేవు.

'బాగా ఆలోచించానం'టూ తలూపేను.

'సరే, అయితే నీ పయి చదువులకు తగినంత కట్టుదిట్టం చేయిస్తాను.'

ఆ మాటలకు అప్పుడే నేను ఏమో అయి పోయినట్టు ఊహించుకుంటూ, మనస్సు ఆనందంతో తేలిపోతూంటే, తండ్రిముందర నించి లేచి, నా కోర్కెలు సిద్ధింపచేసిన హెడ్‌మాష్టరుకు మూగగా కృతజ్ఞతలు సమ ర్పించి బయటికి వెళ్ళిపోయేను.

పట్నానికి వెళ్ళేముందు మానాన్న 'రాజా! ఇన్నాళ్ళు నేను వైద్యం చేసేను. నేను శాస్త్రీయంగా చదువుకొని చేసిందిగాదుయిది. నీవు మాత్రం శాస్త్రీయంగా చదువుకొని డిగ్రీ తెచ్చుకో. డాక్టరువయింతర్వాత ఇక్కడే యీ పల్లెటూళ్ళలోనే, మాకళ్ళముందే నువ్వు డాక్టరుగా చెలామణీ కావాలి' అన్నాడు.

అందుకే నేను కష్టపడి చదివేను. వీలయినన్ని స్కాలర్‌షిప్‌లను సంపాయించి నాన్నకు తక్కువలో తక్కువ ఖర్చయేటట్టు చూసేను. ఎంత పొదుపుగా ఉన్నా ఆ రెండె కరాలు అమ్మేయవలసి వచ్చింది మా నాన్న నా యిద్దరు చెల్లెళ్ళకూ పెళ్ళి చేయకుండానే అప్పుల పాలయేడు నావల. ఎంబి బి యస్.

పూర్తికాగానే పల్లెటూరికి వచ్చేస్తాననుకున్నాను. కాని ఆ యీ కాలంలో అసలు ఏం. బి బి యస్‌కి ఒక విలువంటూ లేదు. ఇది స్పెషలైజేషన్ రోజులు. అందుకే ఎం డి. చేయాలనిపించింది.

ఈ మాటే నాన్నకు చెప్పేను. నాన్న ముఖంలోకి, తమ్ముల ముఖంలోకి చూస్తూ చెప్పలేకపోయేను. బ్రతుకు భారంతో బాధ్యతల బరువడిలో బాగా చిక్కిపోయేడు వృద్ధాప్యపు ఛాయలు నాన్నమీద కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. తమ్ములు సరిఅయిన తిండిలేక, పనితో శరీరాలు అరగగొట్టుకుని సరిగ్గా ఎదగలేదు. వీళ్ళ ముందు ముందు పువ్వు లాంటి జీవితం గడపాలంటే నేను చెప్పక తప్పదు అని ముఖంలోకి చూడలేక తలవొంచుకునే చెప్పేను. నాన్న మునుపటిలాకాదు ఇప్పుడు అతనిలో ఓపికతో నచ్చచెప్పే శక్తి లేదు. ఉన్నా అది తన ఎదిగిన కొడుకు ముందు పనిచేయదు– అనుకున్నాడేమో, 'సరియిష్టం' అన్నాడు.

వొచ్చేసేముందు కండలేని అతని చేతిని నా చేతిలో తీసుకుంటూ 'నాన్నా! నన్ను క్షమించండి, తొందరలో మిమ్మల్ని సుఖపడేటట్టు చేసేందుకు ప్రయత్నిస్తాను' అంటూ వచ్చేసేను.

నాకు ఎం. డి. లో యిక్కడ సీటొచ్చింది. రెండేళ్ళు కష్టపడిచదివి డిగ్రీ తెచ్చుకున్నాను" అంటూ తన కథ ముగించి – "యిప్పుడు చెప్పండిసార్! నా కుటుంబ పరిస్థితులగురించి చెప్పేను. యికవించి మా నాన్న నిర్ణయించినట్టు నాకు నడుచుకోవాలని ఉంది. అతనికి యిన్నిరోజులూ మనస్తాపం కల్గించేను. యిక నాకు అలా చేయాలనిలేదు."

కొద్దిగా విషాదంగా ఉన్నా, కొద్దిగా చలించినా డా. గోవర్ధన్ తన్ను తాను మరో పెగ్గుతో మరచిపోతూ, అదేదో అతిసామాన్యమైన విషయంలా 'ఆల్‌రైట్ మై బాయ్, నా యీ ఆఫరు యిప్పుడు కాదు ఎప్పుడూ ఉంటుంది. ఎప్పుడైనా ఉద్యోగం వెంటనే కావాలంటే, భవిష్యత్తు నిన్ను వెతుక్కు రావాలంటే నాకో చిన్న పోస్టుకార్డు రాయ్. కార్డు అందిన వారంలో నీ ఉద్యోగం నీకు రెడీ' అంటూ లేచేడు షేక్‌హాండ్ యిస్తూ.

రాజా కూడా బిల్ చెల్లించి లేచేడు.

'నిన్ను ఎక్కడ డ్రాప్ చేయమంటావ్'

'నేను నడుచుకుంటూవెళ్తాను. నాకు



కొంచెం పనుంది' అంటూ డా. గోవర్ధన్ కారు స్టార్టు కాగానే "మంజుల తన గదిలో ఎదురుచూస్తూంటుంది. ఇప్పటికే గంట ఆలస్యం అయింది" అనుకుంటూ బయలుదేరేను.

*　　*　　*

రాజా తలుపు కొట్టేటప్పటికి మంజుల తలుపు తీసింది ఆమె ముఖంలో చిరుకోపం కనపడుతూంది. 'డాక్టరుగారికి యిప్పటికా తీరిక చిక్కింది? హాయిగా సాయంత్రం సినిమాకి వెళదాం అనుకున్నాం. తర్వాత ఫైవ్‌స్టార్ హోటల్‌లో డిన్నర్ అనుకున్నాం. ఏమీలేదు. ఆఖరికి ఆకలే దక్కింది– డాక్టరుగారు ఎం. డి. గోల్డ్ మెడల్ తీసుకున్న రోజా.'

'సారీ మంజూ! ఇవాళ మా బాస్ హాస్పిటల్‌లో పార్టీ అంటూ నన్నువిడవలేదు. అతను డ్రింక్సు లేవకుండా తీసుకుంటూ

దుద్దులూ, ఎర్రగాజులు, ఎర్రగులాబీతో ఏపిల్ పండులా ఉంది. గది తలుపు మూసి ఆమె దగ్గరకు నడుస్తూ 'మంజూ' అంటూ ఆమెను ఆలింగనం చేసుకున్నాడు. సున్నితంగా అతని చేతుల్ని తీసేస్తూ 'చాల్లెండి!' అంది కసురుకుంటున్న గొంతుకతో.

'మంజూ! నువ్వు కోపాన్ని ముఖం మీద ప్రదర్శిస్తే, నా ముఖంతో నీ ముఖాన్ని కప్పేయవలసివస్తుంది. జాగ్రత్త!' అంటూ బెదిరిస్తూ తిరిగి ఆమెను బాహువుల్లో బంధించేడు

'రాజా!' అంటూ అతన్ని మరీ దగ్గరగా హత్తుకుపోతూ 'యివాళ ఏంటేంటో అనుకున్నాను. కాని ఏదీజరగలేదు. పోనీలే! కనీసం నిన్ను పట్టుకోగలిగేను. ఆ మాత్రమే చాలు' అంటూ మంచం మీదనుంచి లేస్తూ తన ముఖానికి దగ్గరగా జరుగుతూ 'రాజా! రేపు నువ్వు ఊరికి వెళ్ళిపోతున్నావు. ఈ రెండేళ్ళు







కూర్చున్నారు. అతన్ని వొదలి వచ్చేటప్పటికి యీ సమయం అయింది.'

'అన్నీ బయట అయిం తరువాత ఆఖరికి నా దగ్గరికి వచ్చేరన్నమాట. పోన్లెండి' అంటూ కోపంతో చిర్రుబుర్రు లాడుతూ మంచంమీద కూర్చుంది.

ట్యూబ్‌లైట్ పాలరంగులాంటి వెలుగులో ఎర్రటి మంజుల ఎర్రటి చీరతో వెలిగిపోతూంది. ఆమె ఎర్ర గాజులూ, ఎర్ర

యిక్కడే ఉన్నావు కాబట్టి– దిగులేమనా నేను పట్టించుకోలేక పోయేను. రేపు నువ్వు మీ ఊరు వెళిపోయిం తరువాత తిరిగి నిన్ను నేను కలవగలిగేది మన వివాహంలోనే' ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యేయి. గొంతుక బొంగురు పోయింది. ఉద్వేగంతో కొద్దిగా పెదాలు వొణుకుతున్నాయి.

రాజా మంజును మరింత గట్టిగా హత్తుకుంటూ 'మంజూ! నువ్వు వోపిక పట్టాలి.

# నర్సింగ్ హోం

నమ్మకం ఉంచాలి. నా సంగతులన్నీ నీకు తెలుసు ఏదీ దాచలేదు. నేను నమ్మకం ఉంచు అని చెప్పటం తేలికే! దాన్ని ఉంచటం చాలా కష్టమే! అయినా తప్పదు. నేను ప్రాక్టీసు పెట్టి కొద్దిగా ఆర్థిక స్థోమత తెచ్చుకొనేదాకా యీ ఎడబాటు మనిద్దరి మధ్యా ఉంటుంది. నేను నీకు తప్పకుండా ఉత్తరాలు రాస్తుంటాను '

'ఏంటో రాజా! నువ్వు ఎంత చెబుతున్నా నాకు భయంగానే వుంది. అయినా నీవు అన్నట్టు తప్పదు యీ ఎడబాటు'— తన కంఠాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ అంది.

అందుకే మంజుల అంటే రాజాకు అంత అభిమానం. ఆమెతో ఎలాంటి విషయాన్ని అయినా చర్చించొచ్చు. 'ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకుని చాలా సాఫీగా జీవితాన్ని గడిపేయొచ్చు'అన్న నమ్మకం ఉంది అతనికి. 'తన బాధ్యతలకు మంజులే సరియైన జీవిత భాగస్వామి' అన్న నిర్ణయానికి ఏనాడో తను వొచ్చేడు. 'తను యీమెను విడిచేస్తే యిలాంటి సంబంధం దొరకదు' అన్న నమ్మకం కూడా ఉంది.

రెండేళ్లనించీ తనకు పరిచయం ఉన్నా, ఆమె యింట్లో ఎన్నిగొడవలు జరిగినా, వేటినీ లక్ష్యంచేయకుండా తన్నే నమ్ముకుంది. వొక్కరోజూ తన్ను వొత్తిడి చేయలేదు.

తమ యిద్దరి గురించి అందరూ అసహ్యంగా మాట్లాడుకుంటూంటారు. వాళ్ళ యింట్లో సరేసరి. ఆమెగురించి చాలా వ్యంగ్యంగా మాట్లాడుకుంటూంటారు. అయినా వేటికీ ఆమె మనస్థైర్యం చెదర లేదు. తుఫానుకి నిశ్చలంగా ఉన్న కొండలా ఉంది

తమ యిద్దరి పరిచయం చాలా సింపుల్‌గా జరిగింది. అదీ యీ హాస్పిటల్‌లోనే.

ఒకరోజు! హాస్పిటల్‌కి పెన్సిలిన్ రియాక్షన్ కేసువొచ్చింది. చాలా సీరియస్ రియాక్షన్. వొళ్ళంతా [వాచిపోయి, బీపీ చాలా తక్కువగా ఉంది. కేసు బ్రతుకు తుందన్ననమ్మకంలేదు. తను ఆ రోజు ఎ.డి.ఎం.వో.గా ఉన్నాడు. రాత్రంతా చాలా కష్టపడ్డాడు. ఆమె అదృష్టం ఉండి బాగుంది. తెల్లవారి ఐయిదింటికి డేంజర్ దాటిందని తన గదికెళ్ళి పడుకున్నాడు.

ప్రొద్దున్న లేచేటప్పటికి పది అయింది. కాలకృత్యాలన్నీ ముగించి వార్డులోకి వచ్చేడు. తన పేషంటు ఉన్న స్థలంలో టీప్‌టాగా డ్రస్ చేసుకుని హోటల్ గదిలో పడుకున్నట్టున్న ఆమెని చూసేడు. అప్పుడే అనిపించింది ఆమెకు డ్రస్సింగ్ అంటే హాబీ అని

రెండు రోజుల తర్వాత డిస్చార్జి అయింది. ఆ రెండు రోజుల్లో పరిచయం పెరిగింది. అదే కవేణా ప్రేమగా రూపందాల్చింది.

మంజుల ఎమ్. ఎస్‌సి చేసి స్కూల్‌లో టీచరుగా పని చేస్తోంది. ఆమెకు మంచి మంచి ఉద్యోగాలొచ్చాయి. కాని దూరంగా వొచ్చిన ఉద్యోగాలకు ఆడపిల్లను వొంటరిగా వొదలడం యిష్టంలేక స్కూల్‌లోనే పని చేసేందుకు పర్మిషన్ యిచ్చేరు, ఆమె తల్లి తండ్రులు. ఆమెకు చీరల పిచ్చి మహాపిచ్చి. తనకు వచ్చిన జీతంలో సగభాగం చీరలు కొనేందుకే ఖర్చుపెడుతుంది. ప్రతీ క్రొత్త చీరా కట్టుకొని తన్ను కలుసుకొనేందుకు వొచ్చేది. తను చెప్పాలి చీర బాగుందనీ. లేకపోతే ఆరోజు తనకు అర్చన తప్పదు. కోపంతో— 'నీ గురించి నేను కట్టుకుంటే నువ్వు నిమ్మకు నీరెత్తినట్టు అట్లా కూర్చుంటావేంటి ? యింత డ్రస్సింగ్ చేసుకున్నా నీ కళ్ళకు ఆనటంలేదేంటి ?' అంటూ తిడుతుంది. అందుకే ఆమె కనుపించ గానే 'చాలా బాగుందే నీకు యీ చీర!' అంటూ మొదలుపెడ్తాడు.

ఆమెతో సినిమాలకు వెళ్లేడు, గార్డెన్ కెళ్ళేడు. గదిలో కూర్చుని కబుర్లు గంటలు తరబడి చెప్పుకున్నారు.

తను రేపు వెళ్ళిపోతున్నానంటే తనకు అలవాటు పడిన యీ జీవితం ఎంతగా మిస్ అవుతాడో! బాధగా ఉంది.

ఆలోచిస్తున్నకొద్దీ సంతోషమైన యీ రోజు విషాదంగా కాసాగింది బుజ్జగించే తనే దుఃఖపడితే మంజుల మరీ క్రుంగిపోతుందని 'మంజూ!' అంటూ పిలిచి ఆమె ముఖాన్ని తన చేతుల్లో అందుకుని 'రా, అలా బయటికి వెళ్ళి ఏం అయినా తిందాం' అన్నాడు.

'రాత్రి పది గంటలకా! ఇప్పుడు ఏ దుకాణాలు ఉంటాయేంటి— మనకు తిండి పెట్టేందుకు?'

'పోనీలే అలా బయటికి వెళ్ళి వద్దాం'

తమ కుటుంబపు పౌష్టిక ఆహారం
గురించి తల్లులు బాధపడుతుంటారు.
అయితే సుచిత్రకు ఆ
చింత లేదు...

"ఎందుకంటే, నేను మా కుటుంబానికి రోజూ హార్లిక్స్ ఇస్తాను. హార్లిక్స్ ఇమ్మని డాక్టరు చెప్పినప్పటి నుంచి, ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగటం మా కుటుంబానికి అలవాటు చేసాను. హార్లిక్స్ రోజంతా వారిని ఆరోగ్యంగా, చలాకీగా ఉంచుతుందని నాకు తెలుసు.




మీరు కూడా మి కుటుంబం
లోని వారికే హార్లిక్స్ ఇస్తారు కదూ?'

HTD-HMM-6860



"ఆరోగ్య పోషణకు
మూలాధారం హార్లిక్స్. వివిధ పోషకాహారాలతో
అద్భుతంగా దానిని తయారుచేశారు.
ఇన్నో ఏండ్లుగా సుస్థిరమైన మంచి ఫలితాలను
ఇస్తోంది. అందుచేతనే మీ కుటుంబ సభ్యుల
ఆరోగ్యాభివృద్ధికి, వారు రోజుల తరబడి
చురుగ్గా ఉండేందుకూ హార్లిక్స్‌ను
నేను సిఫారసు చేస్తున్నాను."

మంచి
పుష్టికరమైనది

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్

'నీక్కడికీ వొద్దు—యిక్కడే కూర్చుందాం; నాకు యీ రోజు ఆకలిగా లేదు.'

'నాకు ఆకలిగా ఉందే' అన్నాడు రాజా.

'నీకు ఏ ఆకలో నాకు బాగా తెల్సు. కాని ఆ ఆకలి పెళ్లి అయిన తర్వాత ఉండాల్సిన ఆకలి అబ్బాయిగారు కాస్తంత ఆగాలి' అంటూ కొంటెగా నవ్వింది.

ఆ నవ్వే రాజాను రెచ్చగొడుతుంది. అలా నవ్వితే తన్ను తాను కంట్రోల్ చేసుకోలేడు. 'మంజూ!' అంటూ మోహంతో పిలిచేడు.

'డాక్టరుగారూ! దూరం!' అంటూ అతన్ని సుతారంగా నెట్టివేస్తూ 'మీ ప్లాన్స్ చెప్పండి?'' అంది.

'ప్లాన్సేంలేవు. రేపు నాన్న దగ్గరికి వెళ్తాను, అతను ఏం చెబితే అలాచేస్తాను'

'రాజా! నాన్నగారు ఏం చెప్పగలరు, నీకు మంచి అనిపించింది నువ్వు చేసేయ్ అంటారు. అప్పుడేంచేస్తావు?'

'ఏం చేయమంటావో నీవే చెప్పు.'

'నువ్వు ఎం. డీ. చేసి పల్లెటూర్లో ప్రాక్టీసు చేయడంలో అర్థంలేదు. మీ పల్లెకు నలభై మైళ్ల దూరంలో సికిందరాబాదు ఉందన్నావు కాబట్టి నీవు శుభంగా సికిందరాబాదులో క్లినిక్ మొదలు పెట్టు. వాళ్లకు దగ్గరలో ఉంటావు కాబట్టి వాళ్ళు అనుకున్నప్పుడూ, నీవు అనుకున్నప్పుడూ వొకళ్ళ నొకళ్ళు చూసుకోవచ్చు.'

'మంజూ! నువ్వు చాలా మంచిదానవు' అంటూ కరిగిపోయేడు. ఆమెగాని యిక్కడే

# నర్సింగ్ హోం

ప్రాక్టీసు పెట్టమని స్వార్థంతో అనొచ్చు. అయినా అలా అనలేదు తలిదండ్రులకు దగ్గరగా ఉండమంది.

ఆ రాత్రి ఆర్ద్రతతో కొంత, ఉద్వేగంతో కొంత గడిచిపోయింది.

మర్నాడు గది ఖాళీ చేసి వెళ్ళిపోయేడు రాజా.

* * *

డాక్టర్ విశ్వం పేరు సికిందరాబాదులో వినవివారెవరూ లేరు. స్టేషన్‌లో దిగి రిక్షా వాడితోనైనా, ఆటోవాడితోనైనా 'డాక్టర్ విశ్వం యిల్లు తెలుసా?' అంటే 'కూర్చోండి సార్ తీసుకువెళ్తాను' అంటాడు. అతడు బిజీ సర్జన్. అతణ్ణి కలుసుకోవాలంటే ఆ రోజు ఆఫీసు లీవుపెట్టాల్సిందే అతను పట్టని కేసంటూ లేదు. చేయని ఆపరేష నంటూ లేదు. అతను చేసిన ఆపరేషన్లన్నీ సక్సెస్. అతను కోరినంత ఫీజు యిచ్చి అతని కోసం పడిగాపులు పడి ఎదురు చూసి అతని చేత ఆపరేషను చేయించుకుంటూంటారు ప్రజలు. అతనికి ఆ వూళ్ళోనివాళ్ళే కాదు, దూరంనించి కూడా వచ్చి అతనిచేత సర్జరీ చేయించుకుంటారు. అతను కొత్తగా క్లినిక్ పెట్టుకున్న రోజుల్లో సైకిలు మీద యింటింటికీ వెళ్లి యింజక్షను ఇచ్చేవాడు. కుట్లు వేసుకున్న చొక్కాతో పేషంట్లకు అతి అణకువగా సమాధానాలిచ్చి, యీ రోజు పేరు ప్రఖ్యాతులుగల డాక్టరు అయేడు. అతడు ప్రతి సంవత్సరం కారు మారుస్తూంటాడు.

ఈరోజు కింగ్సువేలో నాలుగు అంతస్తుల భవనం కట్టేడు. చుట్టుపక్కల సందడి రోజురోజుకీ అధికం కావడంవల్ల— అతను ఊరికి దూరంగా వొక వెయ్యి గజాల స్థలం కొని అందులో అందంగా అధునాతనంగా యిల్లు నిర్మించుకున్నాడు

చూట్టూరా మంచి గార్డెన్ వేసేడు. అన్ని రకాల పూలశోభతో విరాజిల్లే ఆ గార్డెన్‌లో తీరికగా లిప్టన్ టీ కూర్చొని తాగాలని కట్టినప్పటినించీ ప్రయత్నిస్తూనే ఉన్నాడు. ఈరోజు కొంచెం ఖాళీగా ఉంది. నా కోరిక నెరవేరబోతూంది— అనుకుంటూ వొక పది నిమిషాలు భార్యతో కూర్చుంటాడో లేదో ఫోను మ్రోగుతుంది.

'ఎమర్జన్సీ! ఎటెండ్ కావాలి' అంటూ వెళ్లిపోతాడు.

మొదట్లో డబ్బులు కుప్పలు కుప్పలుగా వస్తూంటే ఆమె చాలా సంతోష పడింది, తన కోరికలు తీరేరోజువచ్చింది అనుకుంటూ. కాని వొక నాలుగు అంతస్థుల మేడ, కారు, ఊరికి దూరంగా యిల్లూ, ఉద్యానవనమూ, యివి అన్ని ఉన్నా, దూరమయిన భర్తను చూస్తూంటే ఆమెకు ఏడుపులోంచి బాధ తరుగుకు వచ్చేది వొకటి రెండు సార్లు భర్తతో 'ఎందుకండీ! పొద్దస్తమానం యిలా మిషినులా పనిచేయడం. నా మాటవిని టైము అంటూ పెట్టి, అది దాటింతరువాత పేషంట్లు వాస్తే చూడకండి' అనేది.

'శాంతా! నువ్వు చెప్పిన టైముకే జబ్బు రావాలంటూ ఎక్కడా లేదు. అలా సర్జన్ను టైము పెట్టుకూడదు కూడా! శుభంగా పెళ్లి భోజనం చేసి, ఏ ఎపెండిక్సో తెచ్చుకున్నవాడితో నువ్వు నా టైములో జబ్బు ఎందుకు తెచ్చుకోలేదు? ' అంటూ నిలా అడగను చెప్పు? ఏ జలుబో, దగ్గో, తలనొప్పో ఉన్నవాళ్ళతో తర్వాత రా అంటూ పంపివేయడానికి వీలు పడుతుంది. అంతేకాని యీ యమర్జన్సీల్లో అలా కాదు' అనేవాడు.

'అయితే సికిందరాబాదు సర్జన్లకూ ఆసుపత్రులకూ గొడ్డుపోయిందేంటి? మీరు ఇంటికి వచ్చిన తర్వాత వొచ్చిన కేసుల్ని వేరే ఆసుపత్రికి పొమ్మనండి.'

'అలా పొమ్మని చెప్పలేం ముఖ్యంగా యీ

# కొత్త రకం మొక్కల సృష్టి

అమినో యాసిడ్లుగల కొత్త రకం మొక్కలను సృష్టించడానికి భారతీయ జన్యుశాస్త్ర వేత్తలు పథకాలు వేశారు. వృక్షకణాల మేళవింపు ద్వారా ఈ సమస్య పరిష్కారానికి వారు ప్రయత్నిస్తున్నారు. సంకరజాతి మొక్కలను సృష్టించడం, గుజ్జుగల మొక్కలు, గోధుమ మొక్కలలోని కణాలను సమ్మిళితం చేయడం, లేదా గోధుమలోని క్రోమోజోములను గుజ్జుగల మొక్కల జన్యువులోకి చొప్పించడం ఈ ప్రక్రియలో భాగం.

సోవియట్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తుకు సంబంధించిన మాలెక్యులర్ జెనెటిక్స్ సంస్థకు చెందిన అలెగ్జాండర్ అలెగ్జాండ్రోవ్ 'సోవియట్ భూమి'కి ఇచ్చిన ఇంటర్వ్యూలో ఈ విషయాన్ని గురించి తెలిపారు శాస్త్రవేత్తల మార్పిడి కార్యక్రమం క్రింద సోవియట్ శాస్త్రవేత్తల ప్రతినిధివర్గ నాయకుడిగా ఆయన భారతదేశంలో పర్యటించారు.

భారతదేశంలో శాస్త్రీయ పరిశోధన అత్యున్నత స్థాయిలో కొనసాగుతూ వున్నదని, అత్యంత నైపుణ్యంగల జన్యుశాస్త్రవేత్తలు వున్నారనీ ఆయన ప్రశంసించారు. భారతీయ జన్యుశాస్త్రం కేవలం శాస్త్ర విజ్ఞాన ప్రయోగాలకు మాత్రమే పరిమితం కాక, జాతీయ వ్యవసాయ రంగంలోని సమస్యల పరిష్కారానికి తోడ్పడుతూ వున్నదన్నారు.

ఆంధ్ర సచిత్ర వారపత్రిక పరిశీలనార్థం పంపే బొమ్మలు, ముఖచిత్ర రచనలు పంపేవారు కూడా వాటితోపాటు తగినన్ని తపాలా బిళ్లలు అంటించిన కవరును జతపరచకపోతే అవి త్రిప్పి పంపబడవు. —సం.

## నర్సింగ్ హోం

వృత్తిలో. వొకవేళ అర్హ్ వాళు పోరు'

ఇతనితో వాదించి లాభంలేదని అతన్ని అతని ప్రాక్టీసుకు విడిచిపెట్టేసి సణుగుడు మాత్రం విడవకుండా పట్టుకుంది.

డాక్టర్ విశ్వం ఆస్పత్రిలో సివిల్‌సర్జనుగా పనిచేసేడు. అతని వోపీ వొక తీర్థంలా ఉండేది. మిగతావాళ్ళ వోపిలో బెంచీలూ కుర్చీలూ లెక్కపెట్టచ్చు. కాని యితని వోపీలో ఎన్ని బెంచీలు వేసినా యింకా చరిపోనట్టు ఉండేది అతని వార్డులో ఎడ్మిట్ అయిన పేషంట్లు మంచాలు చాలక క్రింద బెడ్‌లు పరచుకొని పడుకొనేవారు

అతని ఆపరేషన్‌రోజు—అతను ఆపరేషన్లు తొమ్మిదికి మొదలుపెడితే అయిదు దాకా అలా సాగుతూనే పోయేవి.

ఆసుపత్రులో రెండు దాటింతరువాత, నర్సులూ, ఎనస్తీటిస్టులూ, ఎసిస్టెంట్లూ ఉండక్కరలేదు. వాళ్ళ డ్యూటీ ఒంటిగంటకో రెండుకు అయిపోతుంది. విశ్వం అందర్నీ బతిమాలి మంచి చేసుకొని ఆపరేషన్లన్నీ పూర్తిచేసుకొనేవాడు అలా అతనితో సహకార పడినందుకు వాళ్ళకు ఏ తక్కువా రానిచ్చేవాడు కాదు. ప్రతీ పండక్కీ తన చేతి క్రింద పనిచేసే వాళ్ళకందరికీ గిఫ్టులు యిచ్చేవాడు.

ఆసుపత్రి పని పూర్తిచేసి అక్కడ కాలేజీలో టీచ్ చేసి యింటికి వచ్చేటప్పటికి ఏ నాల్గో అయేది. భోజనంచేసి — అతని క్లినిక్‌కు పరిగెత్తేవాడు. అక్కడ జనం 'డాక్టరు ఎప్పుడు వస్తాడా' అని ఎదురు చూస్తూ కూర్చునేవారు. వాళ్ళందరినీ పంపించి, తన ఆపరేషన్ కేసులు ప్రయివేటుగా నర్సింగ్‌హోంలో చేసి యింటికి వచ్చేటప్పటికి పదకొండు దాటిపోయేది. అతని వోపీరోజు ఆసుపత్రినించి రాత్రిళ్ళు ఎమర్జన్సీ కాల్సు వచ్చేవి. అవి రానిరోజు నర్సింగ్‌హోం నించి కాల్సు. అయిదేళ్ళ క్రిందటి దాకా యితర ప్రయివేట్ నర్సింగ్‌హోంస్‌లో ఆపరేట్ చేసే విశ్వం—అయిదేళ్ళ క్రిందట స్వంతంగా తనే నర్సింగ్‌హోం వొకటి కట్టి—అందులోనే తన కేసుల్ని చేసేవాడు మెల్లగా యింకో చోటికి పోవడం తగ్గించేసేడు.

రెండేళ్ళ క్రిందట అటు ప్రయివేట్ ప్రాక్టీసుకూ యిటు హాస్పిటలు ప్రాక్టీసుకూ

 

# వారఫలం

 

**17–7–1981 శుక్రవారం మొదలు**
**23–7–1981 గురువారం వరకు**

మేషం : పూలకే అనుమానం పెట్టుకోవటంతో కొన్ని పనులు చెడిపోయే మార్గముమన్నది. గ్రహచారం, మనో చాంచల్యానికి కారకం కాగలదు. ఉద్యోగ ప్రయత్నం చేయాలిసిందే. అది ఫలవంతం కావటం నిజమే. స్త్రీలకు: వస్తు సేకరణకు, అభివృద్ధి కార్యక్రమం అమలు చేయడానికి అనుకూల వారం.

వృషభం : బంధువులురాక, మిత్రులను కలిసికోవటం, ఏదో ఎవరి బాగుకో ధనం వ్యయం చేయవలసి కూడా రావచ్చు. భూములను గూర్చి నూతన సమస్యలు తలయెత్తగలవు. అయినవారితో వృథా పేచీలు కూడా చెప్పదగిన వారమే. స్త్రీలకు: కార్య భారం, వృత్తిలో అభివృద్ధి చెప్పదగిన వారం. ఆరోగ్య లోపం లేదు.

మిథునం : వస్తువులు పోగొట్టుకొంటారేమో జాగ్రత్త! రోడ్డు ప్రమాదం ఉంటుందేమో, మరీ జాగ్రత్తపడాలి. వ్యాపారం యథాతథంగా సాగిపోయే మార్గముమన్నది. అప్పులు వసూలు చేయటానికి ప్రయత్నించండి. నెరవేరే గ్రహచారముమన్నది. స్త్రీలకు : అనేక విధాల మేలు చేకూర్చగల వారం. పోయిన అవకాశాలు మరలా దొరికే మార్గముమన్న వారం.

కర్కాటకం : చేతినిండా పని చేకూరుతుంది. కావలసినంత ధనం చేకూరే మార్గముమన్నది. ప్రయత్నించండి. బంధు ద్వేషం పనికిరాదు. శుభకార్య ప్రస్తావనలుంటాయిగాని అవి సాగి రాలేదనే బాధ కూడా ఉంటుంది. స్త్రీలకు : నూతన విషయాలు గ్రహించడం, అమూల్య వస్తువులు సేకరించుకొనుటకు అవకాశం గల వారం.

సింహం : ఆరోగ్య లోపం, ఆర్థికంగా లోపం కనిపించడం, అనుకున్న కార్యక్రమం, క్రమంగా సాగి రాకపోవటం కూడా గమనించుమన్నారు. మీ మేలు కోరేవారి హిత వాక్యాలు పెడచెవిని పెట్టకండి. స్త్రీలకు : భూముల వలన, ఇండ్ల వలన ఆదాయముంటుంది. ఉన్నత విద్య కొనసాగుతుంది.

కన్య : ఆదాయం గల దివం. అవాంతరాలు క్రమంగా తొలగి, అనుకున్న కార్యక్రమం సాగిపోతుంది. అప్రయత్న లబ్ధికి అవకాశముంది. అయినవారి సహాయం లభించే అవకాశముంటుంది. స్త్రీలకు : విద్యావైజ్ఞానిక రంగాలలో అభివృద్ధి కనిపించడం, పెండ్లి కానివారికి, వివాహ ప్రయత్నాలు సమకూడే వారం. ఆరోగ్య లోపంలేదు.

తుల : బంధువర్గీయులు, ఇంటికి రాగలరు ఆదాయానికి, వ్యయానికి పెద్దగా వ్యత్యాసం కనిపించదు. ఎంతో శ్రమపడితేగాని, ఆశించిన లబ్ధి చెప్పడానికి లేదు. మీ తాలూకు వస్తువులుపోకుండా చూచుకోండి. స్త్రీలకు వృత్తిలో, ఉద్యోగంలో సర్వానుకూలత చేకూరగల వారం.

వృశ్చికం : ఆదాయాన్ని మించిన వ్యయం. ఆశించిన ఫలితం అందదు. ఇటీవల ఒకసర్యాయం అధిక వ్యయం కనిపించింది గదా! అలాగే మరలా, ఈ వారం మరో రూపంలో వ్యయం కనిపించనున్నది ఇరుగుపొరుగు వారితో, ఎలాంటి పేచీలు రాకుండా చూచుకోండి. స్త్రీలకు:వ్యాపారంగాని, ఉద్యోగంగాని, చేతి వృత్తులకు సంబంధించిన వారికిగాని సుకరంగా ఉండే వారం.

ధనుస్సు : మాటల్లో,చేతల్లో ఎంతో జాగ్రత్తగా ఉండాలి. వస్తువాహనాలు కొనుగోలు చేయటంలో అధిక విలంబనం జరుగుతుంది. కార్మికులకు, కర్షకులకు ఉపయోగకరమైన వారం. స్త్రీలకు: విద్యా వైజ్ఞానిక రంగాలలో అధికావకాశం లభించే మార్గముమన్నది. సమయానికి డబ్బుచిక్కే మార్గం కూడా ఉన్నది.

మకరం : అన్నివిధాలా మేలైన వారం. వస్త్రం రాగల విషయాలలో లాభించేమార్గముమన్నది. శుభ కార్య ప్రస్తావనలు ఇంట జరిగే మార్గముమన్నది. వ్యాపార వ్యవహారాలలో అనుకూలత గల వారమే. స్త్రీలకు: సుఖశాంతులు, సమయానికి ధనం చిక్కటం, ఇత్యాది ఫలితాలుండగలవు.

కుంభం : బంధు విరోధమో, మిత్రులతో పుర్షణ యో,ఇచ్చిపుచ్చుకోవటంలో యిబ్బందులో, చుట్టు ప్రక్కల వారితో గొడవలో రాగల అవకాశమున్నది. చలనచిత్రరంగంలో విహరించే వారికి అనుకూల వారమే. స్త్రీలకు : ధనం చేతికందటం, వస్తువాహనాలు కొనుగోలు చేసే అవకాశం లభించటం గ్రహింపగలరు.

మీనం : అనేక విధాల యిబ్బంది కాలమే. ఏదో చేయబోయి ఏదోచేస్తారు. ఆగ్రహావేశాలకు లోనయ్యే పరిస్థితులు ఏర్పడగలవు. బంధువులకు మీరే సహాయం చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి. స్త్రీలకు— ధనాదాయం, భూమి, గృహ సంబంధమైన యిబ్బందులు చెప్పదగిన వారం. అందులకుతోడు, ఆరోగ్య లోపంకూడా ఏర్పడే అవకాశముమన్నదని గ్రహించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

---

తట్టుకోలేని విశ్వం గవర్నమెంటు సర్వీసు రిజైన్‌చేసి పూర్తిగా ప్రాక్టీసులో పడ్డాడు.

సాధారణంగా గవర్నమెంటు సివిల్ సర్జన్ల ప్రయివేట్ ప్రాక్టీసు, వాళ్ళకు హాస్పిటల్ ఎటాచ్‌మెంటు ఉన్నంతసేపే! ఒక్కసారి వాళ్ళు రిజైన్‌చేస్తే – ప్రాక్టీసులో తొంభై వంతులు తగ్గిపోతుంది. విశ్వం సర్వీస్ రిజైన్ చేస్తున్నప్పుడు, అతని సన్నిహితులు, వొద్దు! అలాంటి పొరపాటు పనేంచేయకండి! అంటూ సలహాయిచ్చేరు. అతను ఎవరి మాటల్నీ లక్ష్యం చేయకుండా రిజైన్ చేసి మర్నాడు ప్రాక్టీసు ఎక్కడ ఉండదో అన్న భయంతో క్లినిక్‌లో అడుగుపెట్టేడు. అతన్ని ఆశ్చర్యపరుస్తూ, రోజూ ఉన్న జనంకంటే ఎక్కువే ఉన్నారు.

తర్వాత అతని ప్రాక్టీసు తారాపథానికి అందుకుంది.

ఏబదైఅయిదేళ్ళ వయసులో ఆరడుగుల పొడుగుతో బెల్‌బాటం పాంటు, అమెరికన్ స్లాక్‌తో దృఢంగా కనిపిస్తూంటాడు. దట్టంగా ఉన్న కను బొమ్మలు అతని వయసును కొంచెం ఎక్కువగా చెబుతూంటాయి. మనిషి నెమ్మదిగా ఏ తొందరా లేకుండా, చేతిమీద మరేపనీ లేనట్టు చాలా విశ్రాంతిగా మాట్లాడుతాడు ఎప్పుడూ. అతను సర్జరీ చేస్తూన్నప్పుడు కూడా అలానే చేస్తాడు చాలా తాపీగా దేనికీ తొందర పడకుండా, చేస్తూన్న కేసు తర్వాత మరే కేసూ లేనట్టుంటాడు. అందుకే అతని ఆపరేషన్లలో కాంప్లికేషన్లు అసలే ఉండవు. సర్జరీ చాలా నీటుగా ఉంటుంది.

విశ్వానికి మెడిసిన్ చదువుతూన్న కూతురొకటీ, ఇంజనీరింగ్ చదువుతూన్న కొడుకూ ఉన్నారు. వాళ్ళ చదువు గురించీ, వాళ్ళ బాగోగుల గురించీ అతనికి పట్టించుకొనే టైము లేదు. ఎవరేనా మీ అమ్మాయి ఎం. ఎస్. ఏ యియర్‌లో ఉందండీ' అంటూ అడిగితే– కొంచెంసేపు ఆలోచించి 'సెకండ్ యియర్‌లో ఉందండీ!' అంటాడు, తను అన్నదాంట్లో తనకే నమ్మకం లేనట్టు.

(ఇంకా వుంది)




ఆడదే అయితే, సన్నగా, నాజూగ్గా, లతలా ఉంది అనొచ్చు. మగాడు కాబట్టి, సన్నగా రివటలా ఉన్నాడు అనక తప్పలేదు. సన్నగా రివటలా ఉన్నా అందగాడు కావచ్చు. కాని ఇతడేమో గూని ఉందా అన్న అనుమానం వచ్చేలా నడుమని భుజాల దగ్గర కాస్త వంచుతాడు.

కళ్లకున్న గోల్డ్‌ఫ్రేమ్ కళ్లద్దాలు, పొందికగా అమర్చుకున్న మీసం, ఒంటిమీద టెరిలిన్ బుష్ షర్టు, లేటెస్ట్ ఫేషన్‌లో మాస్టర్ టైలర్‌చేత కుట్టబడ్డ పంట్లాం, పాలిష్‌తో నిగనిగా నల్లగా మెరుస్తున్న బూట్లు, అతడికి అందగాడన్న బిరుదుని ఇవ్వలేకపోయేయి.

చేతిలోని జిప్ సంచీని ఇటూ అటూ ఊపుతూ అన్నాడు, "ఈ వెధవ బస్సు ఒకనాడూ టైముకొచ్చి ఏడవదు!" అతడు మాటాడినపుడు అవసరాలతో కొంగ కూత పెట్టినట్టే ఉంది–నోరు విప్పేసరికి ముందుకున్న పారపళ్లు రెండూ, కొంగ ముక్కులా ముందుకు తోసుకొచ్చేయి. ఉమ్మి తుంపర్లగా స్ప్రే అయింది!

ఆ జల్లు నించి తప్పించుకొని, రెండో వ్యక్తి, "కొత్తా? ఎప్పుడూ ఉన్నదేకదా?" అంటూ బెక బెక లాడేడు. కప్పకీ ఈ మనిషికీ ఉన్న పోలికలు ఏమిటి? అని ప్రశ్న వేస్తే ఐదోక్లాస్ కుర్రాడేమంటాడంటే ... ఇతడి ముఖం కప్పముఖంలా వెడల్పు — కళ్లు కప్పకళ్లలా పైకి వచ్చేయి. నోరు కప్పనోరులా వెడల్పు, పెదవులు నాలికతో చప్పరించేటప్పుడు పైకివచ్చేది బంకవంటి లాలాజలంతో కప్పనాలిక! అతడి ఒంటిమీద గరుకుగా కనిపించేది కప్పచర్మం!

అతడు పొట్టి, వలం, నలుపు — వీటికి సాయం పెద్దపొట్ట — నడచినపుడు కప్ప గంతులు వేసినట్టుంటుంది — తెలటి ఫుల్ చేతుల కమీజుని, నల్లటి టెరీకాటన్ పంట్లాంలో టక్ చేసి పటకా బెల్ట్‌తో బిగించి కట్టేడు జారిపోకుండా. కమీజుకి గోల్డ్‌క్యాప్ కలం తగిల్చేడు. అతడి చేత ఒక చిన్న సంచీ ఉంది. మొసలి చర్మంతో చేసినట్టు గరుకుగా ఉంది–తొమ్మిదోనెల గర్భిణి స్త్రీలా ఉబ్బిపోయి ఉంది–అతడి బుగ్గనున్న పండయ్య సుబుద్ధి కేతకి కారామసాలా కిళ్లీ అతడి మెదడుకి మంచి నిషా ఇస్తోంది. మాటలు రువ్వుతూ, మధ్య మధ్యని, రక్తం కక్కినట్టు ఎర్రటి కిళ్లీ రసాన్ని ఉమ్ముతున్నాడు.

"బస్సు ఎక్కడయినా బ్రేక్ డౌన్ అయిందేమో కొంపతీసి" అన్నాడు మూడో మగాడు! ఈ మనిషి వరాహావతారం! ఆ అవతారంలో శ్రీమన్నారాయణుడు ఇలాగే ఉండి ఉండాలి! చిత్రకారుడు, దేవుడు ఆ అవతారంలో పట్టు పీతాంబరాలు కట్టుకున్నట్టు చిత్రించినా దిగంబరుడే అయిఉండొచ్చు. కాని ఈమనిషి చెక్కుల బుష్‌షర్ట్ తొడుక్కున్నాడు. చెక్కు చెక్కు గళ్ళ పంట్లాం కట్టుకున్నాడు. చెమట చెలమలా ఊరిపోతోంది. చెమటకంపు బురద కంపులా ఆమడ దూరం కొడుతూ ఉండగా, ఆ దుర్గంధాన్ని కప్పిపుచ్చటానికి కుసేగా సెంటు పులిమేడు!

అతడి ముఖం కోలగా, సూదిగా పంది ముఖంలా ఉంది! ఆ ముఖంలో ముఖ్యంగా అగుపడేవి పెద్ద నోరూ, ముక్కుపుటాలూ! అతడి చేతిలో సంచీలేదుకాని ఒక ఫైలుంది. ఆ ఫైలు పై అట్టమీద అతడు ప్రభుత్వం యొక్క ఏ శాఖకి చెందిందీ ముద్రించి ఉంది, విలక్షన్ సైన్ బోర్డు మీద ఉండేటంత పెద్ద అక్షరాలతో! అందరూ ఆ ఫైలుని చూసి, అతడి ప్రాముఖ్యతని గ్రహించి, పందిలా ఉన్నా ఇతడు వరాహావతారంలోని నారాయణుడంత శక్తిమంతుడే అన్న భ్రమలో పడుతున్నారు. అతడు మాట్లాడినప్పుడు పంది గుర్రు పెట్టినట్టుంది– అతడి ఫైలువల్ల వచ్చిన హోదాలో, గర్వం అతడి ముఖంలో తొణికిసలాడినా, ఆ గర్వం పందే గర్వం చూపితే ఎంత హుందాగా వుంటుందో అంతకన్న ఎక్కువ హుందాతనం ఇవ్వడం లేదు!

"బస్సు బ్రేక్ డౌన్ అయితే ఆ బస్‌ని అక్కడికలా వదిలేసి మెకానిక్ కోసం ఫోన్ చేస్తాడే తప్ప తను మాత్రం రిపేర్ చెయ్యడు ఈనాటి డ్రయివరు!" కొంగ, ఈనాటి లోక రీతిని వివరించి చెప్పేడు!

# దొంగ

"ఎక్కడ చూడండి! ఇన్ డిసిప్లిన్ తప్ప మరేమీ మిగల్లేదు!" కప్ప బెకబెకమన్నాడు

"ప్రతివాడూ పనిదొంగ సార్! ఎలాగ పనిని ఎగ్గొట్టి, ఊరకే డబ్బు గుంజుదాం అని చూడ్డం ఈనాటి కల్చర్!" వరాహం భాష్యం చెప్పేడు, అతడొక్కడే పనిదొంగ కాడు అన్నందుకు చేతిలోని ఫైలు ప్రత్యక్ష సాక్ష్యంగా విలవగా!

"రెక్కలు ముక్కలు చేసుక పనిచేసినా ఏం లాభం సార్? ఎవరు గుర్తించాలి కనక? 'అసలు పని' తెలీనివాడు ఎందుకూ పనికిరాడు!" కప్ప బెకారించేడు!

"మా బాగా చెప్పేరు!" అసలు పనంటే ఏమిటో అర్థమయినట్టు చిరునవ్వు నవ్వుతూ తందాన తానా అన్నాడు కొంగ.

తక్కిన వాళ్ళకి తన కర్థమయినట్టు అయిందో లేదో అన్న అనుమానం వచ్చి కప్ప టీకా తాత్పర్యం చెప్ప పూనుకున్నాడు "కాకి అరుపుంది చూసేరా? కా... కా...? అదీ అసలు పని!" పకపకా నవ్వేడు తన తెలివికి తానే "ఒక్క బాస్‌నే కాదు! ఇంటిదగ్గరుంటుంది అసలు బాస్! అమ్మగారు! ఆమె అనుగ్రహం ముఖ్యం! బజారు పని నించి, వాళ్ళ పిల్లల్ని స్కూళ్ళలో చేర్చడం వరకూ పనంతా నెత్తిన వేసుకోవాలి!"

"మీ కిందులో బాగా అనుభవం ఉన్నట్టుంది!?" వీరి మాటలు శ్రద్ధగా వింటున్న ఒక బస్సు పాంధుడు శిష్యుడు గురువుని అడిగినట్టుగా అడిగేడు.

"నాదంతా థియరీ! దానిని నేను ప్రాక్టీస్ లోనే పెట్టిఉంటే ఏనాడో కారుల్లో తిరిగి ఉందును! ఈ ఆర్‌టీసీ బస్‌కోసం నిలబడ్డం ఏంఖర్మ?" అన్నాడు కప్ప, చిరుకోపం ప్రదర్శిస్తూ.

"మన నిజాయితీనే మన శత్రువుసార్!" కొంగ కూత పెట్టేడు, తన చేతికున్న బంగారు ఉంగరాలు ముద్దు ముద్దుగా ముచ్చటగా చూసుకుంటూ!

"మహా బాగా స్వెలవిచ్చేరు!" నవ్వునీ, మాటల్నీ కలిపి వరాహం అనేలోపున బస్ రానే వచ్చింది.

పెళ్ళినాడు కొత్తగానే ఉన్నా పిల్లలు పుట్టేక పాతబడి, పిట్నపోయిన పాతపరుపులా ఉంది సిటీబస్సు పైకి ఉండలూ కాయలుగా ఎగతన్నిన పాత దూదిలా వేలాడుతున్నారు పాసింజరు. మాసిపోయి, చిరిగిపోయి, రంగు పోయిన దాని పైగుడ్డలా ఉంది బస్సుబాడీ! ఏకించి, కొత్త కవరు వేయించడానికి డబ్బులేని బీదసంసారి ఆ పరుపుని అలానే వదిలేసినట్టు, రిపేర్ చేయించడానికి డబ్బులేకా, విరామంలేకా వదిలీసేరి బస్సుని ఆర్‌టీసీ వారు. మనుషుల్ని మోసీ మోసీ మరి మొయ్యలేక ఏదోనాడు గుటుక్కుమంటే ముసలాడి శవాన్ని ఈడ్చి పారేసినట్టు స్క్రాప్‌యార్డులో పారేయొచ్చని నిర్ణయం చెయ్యబడ్డంవల్ల చేవ ఉన్నంతకాలం డబ్బు ఆర్జించి పెట్టనీ అని ఊరుకున్నారు.

అందరూ రోజంతా పనిచేసి, అలిసిపోయి ఇళ్ళకు పోతున్న పాసింజర్లే అవడాన, బస్సు ఆగీ ఆగగానే గాయంతో ఉన్న ముసలి ఎద్దు మీదికి కాకులు వాలినట్టు వాలేరు. వెనక నించి భూతం వెంటపడుతున్నట్టు, అప్పటికే మానవ శరీరాలతో కూరుకుపోయినా, చీమ కాలుమోపడానికి చోటు లేకపోయినా, ఎలాగో ఓలా ఎక్కిపోయేరు! ప్యాకెట్‌లో కూరిన అప్పడాల్లా ఒకరొన్కొకరు వత్తుక నిలబడ్డారు. కొందరు ఒకకాలు ఫుట్‌బోర్డు మీద మోపి గజాని పట్టుక నేలాడితే, మరికొందరు మరో మనిషిని పట్టుక వేలాడుతున్నారు

నిండా బరువుపడ్డ ముసలి లొట్టిపిట్టలా ఒక పక్కకి ఒదిగిపోయింది బస్సు అందరూ ఎక్కేక "రైట్! రైట్!" అన్నాడు కండక్టరు! డ్రైవరు మొదటి గేరు వేసి, యాక్సిలరేటర్ నొక్కి, క్లచ్ వదిలినా, బరువుతో ఉన్న బండిని లాగలేక ఎంత కొట్టినా కదలని ముసలిఎద్దులా బస్సు కదలేదు. పూర్తిగా ఎక్సిలరేటర్ నొక్కి శక్తినంతా ఇవ్వగా కదలేక కదల్లేక కదిలింది. "హమ్మయ్య! కదిలింది!" పాసింజర్లు ఊపిరి పీసుకున్నారు!

ఓసారి కదిలేక వేగం పుంజుకుంది

"కదుల్తే ఆగదు! ఆగుతే కదల్దు!" అంటూ ఓ ప్రయాణికుడు జోక్ వేసేడు నవ్విద్దామని- ఎవ్వరూ నవ్వలేదు నవ్వే పరిస్థితిలో ఎవ్వరూ లేరు-

ఇంత ఇరుకులోనూ, పద్మవ్యూహంలోకి అభిమన్యుడు చొరపడినట్టు చొరపడి డబ్బులు వసూలు చేస్తున్నాడు కండక్టరు- "టికట్ సార్! టికట్!" అంటున్నాడు ఒక ప్రత్యేకమైన యాసలో. నోట్లు అందుకొని ఐదు వేళ్ళ మధ్యా వాటిని మడిచి పెడుతున్నాడు. భుజాన వున్న తోలు సంచీని గలగలలాడించి చిల్లర తీసి ఇస్తున్నాడు టికట్‌తో సహా. కొందరు పాసింజరు ఎక్కడికి పోవాలో చెప్పి టిక్కెటడుగుతే, మరి కొంతమంది తెలివి మీరినవారు "ఇరవైపైసలు" అంటున్నారు తమ స్టాపుకి టిక్కెట్టు ముప్పయి అయినా-

కొంగ తన సంచీలోంచి మంత్లీ టికెట్ తీసి చూపించేడు-

**(52 వ పేజీ చూడండి)**





సీరియల్

# రాగజ్వాల

చిట్టూరెడ్డి సూర్యకుమారి

సుగుణక్క ఆట్టహాసంగా పుట్టింటి నుంచి వచ్చింది. తిరిగి ప్రక్కింట్లో సందడి ప్రారంభ మయ్యింది. సుగుణక్క కూతురు బొద్దుగా వుంది. రబ్బరు బొమ్మలా వుంది. రమ్య ఎక్కువసేపు ఎత్తుకోలేకపోయింది. బంగారు మొల్రతాడు—చేతులకు బంగారు మురుగులు—సిగ్గుబిళ్ల—మెడలో చైను, కాళ్లకి వెండి కడియాలు — బంగారు బొమ్మలా ముద్దొస్తోంది. ఇద్దరి మధ్య రోజులు నిముషాల్లా గడిచిపోతున్నాయి.

వెంకట్రావ్‌కు వుద్యోగంలో బోలెడన్ని రిమార్కులు — లంచాలు తీసుకోవడం వలన ప్రమోషన్ వెనుకబడిపోయింది. అలాంటిది పాప పుట్టిన వేళా విశేషం — ప్రమోషన్ వచ్చింది. ప్రమోషన్‌తో స్థలం మార్పు వచ్చింది.

ఆ పోర్షన్ అద్దెకు ఇచ్చి కొత్తవూరికి ప్రయాణమైనారు. సుగుణక్క వెళ్లిపోతుంటే రమ్య వెక్కి వెక్కి ఏడ్చింది.

"మీరు వస్తారు అన్న ధైర్యంతో ప్రాణాలు బిగపట్టుకుని వున్నాను. మీరు వెళ్లిపోతున్నారు. మరి నాకు దిక్కు ఎవరు !" అంది.

"రమ్యా! మనం వుండే ఈ ప్రపంచం చాలా చిన్నది. పిలిస్తే పలుకుతాను — ఫోన్‌లో" అంటూ నవ్వింది సుగుణక్క.

"ప్రమోషన్ రాబట్టిపోతున్నాం. పోకతప్పదు. ఏదో కొన్నిరోజులు వుండి ట్రాన్స్‌ఫర్‌కి ప్రయత్నం చేస్తాం — దిగులు పడకు. నీకేం కావలసినా మాకు వ్రాయి. సుందర్ విషయం దిగులు పడకు. డాక్టరమ్మ వుంది. ఆ విషయంలో దిగులులేదు. కాని..." ఏదో చెప్పబోయింది రమ్యకు.

కాని చెప్పలేక పోయినట్లు వుండిపోయింది. రమ్య గ్రహించింది. వసుంధరను ఇంట్లో చేర్చటం అంత మంచిదికాదని చాలాసార్లు చూచాయగా అంది సుగుణక్క.

సుగుణక్క వాళ్లువెళ్లి పోవటంతో ఇల్లు బోసి పోయింది. సందడిలేదు. వాళ్లు లేనిలోటు తీరేదికాదు. మరెవ్వరో వచ్చి చేరారు కాని కలుపుగోలు మనుష్యులుకారు. ఎప్పుడూ తలుపులు, కిటికీలు మూసుకుని లోపలేవుంటారు. ఒకరి సంగతి వారికి అవసరంలేనట్లుగా వుంటారు. పట్నంలోవుండి వచ్చారు. అలాగవుండటానికి అలవాటు పడ్డారు. అదీ ఒకందుకు మంచిది అనుకుంది.

స్నేహం మొదలై అభిమానం, అనురాగాలు పెంచుకుంటే తీరావాళ్లు వెళ్లిపోతే బాధపడవలసి వుంటుంది. సుగుణక్క వాళ్లులేక పోవటంతో ఇంకా గుండెల్లో గుబులుగానేవుంది; అని రమ్య సరిపెట్టుకుంది.

* * *

వసుంధర ఆఫీసుకువచ్చి—శ్రీకాంత్‌ను కారులో ఎక్కించుకుని, ఇంటిదారి పట్టింది.

"రమ్య నాకోసం చూస్తుంటుంది" వాచ్ చూసుకుంటూ అన్నాడు.

"రమ్యకు — సుందర్ వున్నాడులే. మరి నా క్లినిక్ ఎప్పుడు ప్రారంభోత్సవం చేస్తావు ?"

"నేనా ? !"

"మరి నీవేగా నా పర్సనల్ సెక్రటరివి. ఆ... పి. ఎ అంటే బాగులేదు. పార్టనర్ అందామా ?"

(గత సంచిక తరువాయి)

"పార్టనర్ అవటానికి నేనేమైనా డాక్టర్‌వి కనుగ" నవ్వుతూ అన్నాడు.

"వర్కులోకాదు—ఆఫీసు విషయాలన్నీ నీవే చూసుకోవాలి—ఆ విషయాలు తరువాత మాట్లాడుకుందాం..."

"ఏమిటి ఇంత అర్జంటు, ఏదైనా పార్టీ వుందా ?"

"ఆ...హ" క్రీగంట శ్రీకాంత్‌ను చూస్తూ అంది. శ్రీకాంత్ వసుంధరను చూశాడు. ఈరోజు హుషారుగా వుంది. ఫారిన్ సెంట్ నాజూకుగావుంది. సన్నగా వెస్టరన్ మ్యూజిక్ టేప్ రికార్డర్ నుంచి వినిపిస్తోంది. ఎంతోమంది మగవాళ్ల కంటే వసుంధర చక్కగా డ్రైవ్ చేస్తుంది.

"నీవు మంచి డ్రైవర్‌వి" అంటూ ఎప్పుడు అభినందిస్తుంటాడు. పొడుగాటి సన్నని వ్రేళ్లు — స్టీరింగ్‌ను సుతారంగా పట్టుకుని వున్నాయి. ఆమె కట్టుకున్న చీర ఏమిటో చాలా బాగుంది — అనుకుంటూ చూస్తుంటే—

"ఏమిటి చూస్తున్నావ్ ?"

"నీ చీర బాగుంది."

"నన్ను చూస్తున్నావని ఇంతసేపు సంతోషించాను."

**జరిగిన కథ—5 :** నాగయ్య, అమరేశ్వరిలకు ముగ్గురు కూతుళ్లు, ఒక్క కొడుకు విష్ణు. పెద్ద కూతుళ్లిద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మూడవ కూతురు రమ్య, ఎదురింటి శ్రీకాంత్ ప్రేమించుకొంటారు. వాళ్లొకరోజు లేచిపోయి గుళ్ళో పెళ్లి చేసుకొని, కొత్తజీవితం ప్రారంభిస్తారు. ఇంటి యజమాని వెంకట్రావ్ భార్య సుగుణ రమ్యను తన సొంత చెల్లెలుగా చూసుకొంటుంటుంది రమ్యకు గర్భం వస్తుంది. ఈ వార్త పిల్లలు పుట్టని సుగుణకు బాధ కలిగిస్తుంది. కానీ ఆమె కూడా గర్భవతి అవుతుంది. వెంకట్రావ్‌కు కూతురు పుడుతుంది. శ్రీకాంత్‌చిన్ననాటి స్నేహితురాలు డా॥ వసుంధర అతనితో అంత క్లోజ్‌గా ఉండడం సహించలేకపోతుంది రమ్య. రమ్య కొడుకు సుందర్‌కి ఓ రోజు జబ్బుచేస్తే వసుంధరే ఆదుకొంటుంది. అప్పట్నుంచి వసుంధరను చేరదీస్తుంది రమ్య. వసుంధర శ్రీకాంత్‌ను తనవాడిగా చేసుకోవటానికి ప్రయత్నిస్తుంటుంది.

శ్రీకాంత్ పెద్దగా నవ్వాడు. వసుంధర చాలా తమాషాగా మాట్లాడుతుంది.

ఫ్రాంక్‌గా, నిర్భయంగా మాట్లాడుతుంది. తెలియనివాళ్లు అపార్థం చేసుకుంటారు. డాక్టరమ్మ కదా ! ఆడా—మగకి తేడా చూడదు. వచ్చి ప్రక్కన కూర్చుంటుంది.

వీపుమీద, తొడమీద మాట్లాడుతూ — చెయ్యి వేస్తుంది. మగవాడు తగులుతున్నాడు - చూస్తున్నాడు అని అనుకోదు. ఆ తత్వమే తనకెంతో నచ్చింది.

ఇంటికి వెళ్లే దారిలో కొత్తగా పెద్ద పెద్ద బిల్డింగ్స్ కట్టుతున్నారు. ఆ ఇండ్లవైపు చూపి "అవి నాన్నగారు ఇండస్ట్రీలో పనిచేసే ఆఫీసర్ల కొరకు కట్టిస్తున్నారు."

అందులో ఒకయిల్లు చూడగనే నచ్చింది శ్రీకాంత్‌కు.

"నాకు నచ్చింది. మోడల్ ఇచ్చింది నేనే అది మీ ఫ్యాక్టరీ జనరల్ మేనేజరుకు..." ఆ బంగళాకి ముందు వెనుక వేసినచెట్లు ప్రాణం పోసుకుని, గబగబ ఎదుగుతున్నాయి.

ఊరికి దూరంగ మంచిగాలి, వెలుతురు పుష్కలంగ లభించేచోటు — ఆరోగ్యంగవుంది. ఆ ఇంట్లో రమ్యను—తన చిన్నారి కొడుకు సుందర్‌ని వూహించుకున్నాడు.

"ఓ స్వంతమనిషిని చూసి, జనరల్ మేనేజర్‌గా వేసుకోవాలని నాన్నగారు అనుకుంటున్నారు" శ్రీకాంత్ ఒడిలో చెయ్యివేసి అంది.

శ్రీకాంత్ వులిక్కిపడ్డాడు.

ఆవేళలో ఇంట్లో ఎవర్నూలేరు. నిశబ్దంగా వుంది. దీనదయాళ్ వసుంధర నాన్నగారు వూర్లోలేరు. వసుంధరకు ఇద్దరు అన్నలు. అక్కలు వున్నారు—వారందరికి పెళ్లిళ్లు జరిగాయి. ఎవరి సంసారాలు వారు చూసుకుంటున్నారు. పెద్దన్న ఇంట్లోనే వుండి వ్యాపారాలు చూసుకుంటున్నాడు — వసుంధర మెడిసన్‌లో వుండగా తల్లి చనిపోయింది. చిన్న కూతురును గారాబంగా పెంచారు. చదువు అబ్బింది కూడా ఆమెకే. ఆమె ఏం చేసినా ఆ యింట్లో ప్రశ్నించేవాళ్లు లేరని చెప్పాలి.

శ్రీకాంత్‌ను నేరుగా తన గదికి తీసుకు వెళ్లింది.

"పార్టీ అని చెప్పావ్. ఆ సూచనలేవి కనబడటం లేదే ?" అని అన్నాడు

"పార్టీ లేదని ఎవరన్నారు. వసుంధర తన పార్ట్నర్‌కి ఇస్తున్న ప్రత్యేకమైన పార్టీ ఇది" సోఫాలో శ్రీకాంత్ ప్రక్కన కూర్చుంటూ అంది.

ఖరీదైన ఆ గదిలో హాయిగా వుంది. తాముంటున్న ఇంటి డ్రాయింగ్ రూం కంటే విశాలంగా వుందాయింటి డ్రాయింగ్ రూం. దానికి ఆనుకునే వసుంధర బెడ్‌రూం వుంది. ప్రక్కన చిన్న వరండా వుంది. అక్కడ కూర్చుంటే తోటంతా కనిపిస్తుంది.

ఇంట్లోకి వచ్చి పోయేవారిని చూడవచ్చు. అక్కడ టీపాయ్ -- నాలుగు కుర్చీలు వున్నాయి. మాగజైన్స్ తెచ్చి శ్రీకాంత్ ముందువుంచి ఇప్పుడే వస్తాను అనిచెప్పి వెళ్తుంటే,

"రమ్య ఎదురుచూస్తుంటుంది. నేను ఇక్కడ వున్నట్లు కాస్త ఆలస్యంగ వస్తానని కబురు పంపితే...బాగుంటుంది."

వెళ్తున్న వసుంధర శ్రీకాంత్‌ను చూసింది. అందంగా, ఆరోగ్యంగా వున్నాడు. రమ్యలో ఏముందని అంతగా ప్రేమిస్తాడు! ఈ ప్రేమ మూర్తికి ఆ భార్య తగదు అనిపిస్తుంది. చదువు— సంస్కారం — ఐశ్వర్యం వున్న తనలాంటి అందగత్తె అయితే మరెంతగా ప్రేమిస్తాడో?

మెల్లిగా వచ్చి శ్రీకాంత్ ముందు మోకాళ్ళని తల వడిలో వుంచి కూర్చుంది. అనుకోని ఆమె చర్యకు చకితుడై "వసుంధరా ?!" అన్నాడు.

వసుంధర తలెత్తి "శ్రీకాంత్! నీవు రమ్యను ప్రేమించే విధం నన్ను ముగ్ధురాలిని చేస్తోంది, పిచ్చిదానిగా చేస్తోంది. నీలాంటి ప్రేమమూర్తిని భర్తగా పొందిన రమ్య ఎంతో అదృష్టవంతురాలు. చూడు! నాకు అన్నీ వున్నాయి. కాని ఒక్కటే తక్కువ ... నీలాంటి మగవాడి తోడు. నీవు నాకు కావాలి శ్రీకాంత్! ... నిన్నెంతగానో కోరుకుంటున్నాను. నీ ప్రేమ కోసం తపించిపోతున్నాను" శ్రీకాంత్‌ను బిగికౌగిలిలో బిగించి వేసింది.

మెల్లిగా శ్రీకాంత్ చేతులు వసుంధరను చుట్టేశాయి. తోటలో కూర్చున్న వాడి వడిలో పైనుంచి ఓ 'పువ్వు' రాలిపడితే ఏం చేస్తాడు. అప్రయత్నంగా పట్టుకుని మొదట ఆఘ్రాణిస్తాడు.

ఆ చర్యకే పులకించిపోయింది వసుంధర. గర్వంగా నవ్వుకుంది. ఆ మగవాడి స్పర్శతో నిద్రాణితమైన 'కామం' మేల్కొంది. కామజ్వాల వసుంధరను కాల్చివేయసాగింది.

శ్రీకాంత్ చొరవ చేయలేకపోతున్నాడు. ఈ అవకాశాన్ని, ఈ మధుర క్షణాలను వృధా చేయకూడదు. సహజమైన మగవాడి బలహీనతను వాడుకోవాలి — స్త్రీ కలిగించే టెంప్టేషన్‌కు తట్టుకోలేక లొంగిపోయాడు. అది తన అదృష్టము. మరో తలంపు రానీయకూడదు — వెనుకంజవేయకూడదు. తన ప్రేమను వ్యక్తం చేసే సమయం ఇదే ... ఇదే ... తన హృదయం విప్పి చెప్పింది — తన కోరికను తెలిపింది. అయినా శ్రీకాంత్ ఎందుకో ధైర్యం చేయలేకపోతున్నాడు. ఒక కన్నెపిల్లను చెరచకూడదనుకుంటున్నాడా? లేక తాను వివాహితుడన్న జ్ఞాపకం వస్తున్నదా!

వసుంధర వయ్యారంగా లేచి వెళ్లి దుస్తులు మార్చుకుని, వంపులు — యవ్వనం దాచని 'నైటీ' వేసుకువచ్చింది. వస్తూ వస్తూ మధువును పట్టుకు వచ్చింది. వసుంధర నోటికి అందిచ్చిన ఫారిన్ విస్కీని ఒక గుక్కలో తాగేశాడు. శ్రీకాంత్ కళ్ళు ఎరుపెక్కాయి, శరీరం కైపెక్కింది.

విస్కీ బ్రాందీలు మామూలు డ్రింక్స్‌లా ప్రతి పొద్దు త్రాగే నాన్న అన్నయ్యలను చూసే ఆ గొప్పింటి పిల్లకు అది మామూలు విషయంలాగ వుంటుంది. తప్పు అనిపించదు.

తాగనివాడు మగవాడేనా ? అని అనుకొనే అమ్మాయిలూ వున్నారు.

* * *

సంధ్యాదేవి తాపాన్ని భరించలేకనేమో మెరుపుల వైపు దీనంగా చూసింది. సంధ్య పిలుపు నందుకున్న మేఘం పవనుని పట్టుకుని పరుగెత్తుకువచ్చి సూర్యుని కెదురుగా నిలిచింది.

అరె ?! సూర్యుడు అప్పుడే వెళ్లిపోయాడా ? అని తలుస్తూ రేరాణి చీకటి అనే పై వలువను కప్పుకుని దిగివచ్చింది.

మేఘుడు పరుగెత్తుకు పోతున్నాడెందుకు? మరో మబ్బుతునక పరుగందుకుని దాని వెంటబడింది. చీకట్లో చూడక మరో మేఘాన్ని గుద్దేసింది. ఆ మేఘం వురిమింది. కోపంగా చూసింది. పాపం! ఆ మబ్బుతునక నీరు కారిపోయింది.

గగనాన ఆట సయ్యాట మొదలైంది. మబ్బులు పరుగెత్తుతున్నాయి. ఒకటికొకటి ఢీ డిక్కీ — కొట్టుతున్నాయి. మెరుస్తున్నాయి, వురుముతున్నాయి. గగనాన అంతులేని ఆ సందడి, భువికి చేరుకుంది.

వసుంధర అనే పుష్పాన్ని ఆఘ్రాణిస్తున్న శ్రీకాంత్ తలెత్తి చూశాడు. వసుంధర కన్నులు విడివడినాయి —

మెరుపులతో ప్రారంభమైన వర్షం చిక్కగా పడుతోంది. చల్లగాలి కిటికీలోనుంచి దూసుకు వస్తోంది. కిటికీలోనుంచి నింగికేసి చూస్తున్నాడు శ్రీకాంత్. నల్లటి మబ్బు ఆకాశాన తివాచీగా పరచింది. వున్నట్టుండి ఓ మేఘం గర్జించింది.

అతి మందరము, మధురమునైన ఈ క్షణాల్లో శ్రీకాంత్ ఆకాశాన్ని పరీక్షిస్తున్నాడేమిటి?

వసుంధరకు అసహనంగ వుంది. స్వర్గలోకపు సరిహద్దులకు వెళ్లి ఆ లోకంలోకి అడుగిడు సమయాన బలవంతంగా క్రిందికి లాగితే ఎలా వుంటుంది! ఇష్టమైన ఆహారం ముందుండి వూరిస్తుంటే ఎలా వుంటుంది? వసుంధరకు ఎలాగో వుంది.

శ్రీకాంత్ ముఖాన్ని తనవైపుకు మరలించుకుంది. మరెక్కడో వురిమిన వురుము ఆకాశాన దొర్లుకుంటూపోతోంది.

శ్రీకాంత్ చటుక్కున లేచాడు.

(ముక్కుదగ్గర వున్న పుష్పం — గబుక్కున క్రింద పడిపోయింది.)

"సా...రి ఐయామ్ వెరీ సారి. నేను వెళ్లాలి... దుస్తులు సరిచేసుకుంటూ — వురుము అంటే రమ్యకు భయం. ఒంటరిగ బాబుతో ఏం తంటాలు పడుతోందో?" అంటూ బయటికి వచ్చాడు.

ఆ వర్షంలో తడుస్తూ వెళ్లడం పైనుంచి వసుంధర చూసింది.

వర్షిస్తున్న మేఘంలా ఇంట్లోకి వచ్చాడు శ్రీకాంత్; రమ్య పడుకునివుంది. లైటు కాంతిలో ఆమె కళ్ళు మెరుస్తున్నాయి. ఏడ్చినట్లు కనురెప్పలు వుబ్బివున్నాయి.

బాబు రమ్య కడుపులో వొదిగి వెచ్చగ పడుకుని గాఢంగ — నిర్భయంగ నిద్రపోతున్నాడు. వాడ్ని చూస్తే మొదటిసారిగ ఈర్ష్యలాంటిది కలిగింది. తడిసి ముద్దై వచ్చిన తనను పలుకరించనేలేదు రమ్య. ఒకరినొకరు దీర్ఘంగ చూసుకున్నారు ముందు శ్రీకాంత్ కళ్ళు క్రిందికి వాలాయి.

తడిగుడ్డలు మార్చుకుని, ట్యూబ్‌లైటు ఆర్పి, డిమ్‌లైట్ వేసివచ్చి తన మంచంపై పడుకున్నాడు.

శ్రీకాంత్‌కు పిచ్చికోపంగ వుంది రమ్య మౌనం బాధించింది. సిగ్గుగా వుంది. రమ్య ముందు తను తల దించుకోవలసి వచ్చింది అందుకు మరీ కోపంగా వుంది. రమ్య ఏదైన అంటే బాగుండును అనుమానించి, దూషించితే చెంపలు అదిరేలా కొట్టాలి అనుకున్నాడు. ఎందుకో రమ్యను హింసించాలనిపించింది. తనపై తనకు అసహ్యంగాను వుంది... అలా అనుకుంటూనే కళ్ళు మూసుకున్నాడు.

శ్రీకాంత్ నిద్రపోయాడని తెలుసుకుని రమ్య మెల్లిగా లేచి శ్రీకాంత్ దగ్గరకు వచ్చి శ్రీకాంత్ ముఖాన్ని పరీక్షగా చూసింది. శరీరాన్ని తడిమి తడిమి



చూపింది. అతని స్పర్శలో దేవినో వెతికి పట్టుకోవా లనుకుంది. రమ్య మనస్సు నల్లటి మబ్బు కప్పేసిన ఆకాశంలా వుంది.

*   *   *

శ్రీకాంత్ మరునటి రోజు ఎప్పటిలా తన పనులు ముగించుకున్నాడు. మధ్య మధ్య బాబును పలుకరిస్తూ ముద్దు చేస్తూనే వున్నాడు.

మౌనవ్రతం పట్టిన రమ్యను రెట్టించి ఏమి అడగలేదు.

ఆఫీసుకు పోతూ బాబును ఎత్తుకున్న రమ్యను ముద్దు పెట్టుకున్నాడు. రమ్య అతనివైపు కొత్తగా చూసింది. ఏమి ఎరగనట్లు ఏమి జరగనట్లు — "రమ్యా! సాయంకాలము తొందరగ వస్తాను. ఏదైన సినిమాకి పోదాం." ఈల వేసుకుంటూ వెళ్లిపోయాడు.

శ్రీకాంత్ వెళ్లినవైపే చూస్తూ చాలసేపు నిలుచుండిపోయింది రమ్య.

మనస్సు చేదుగా వుంది. తనలో ఏదో మార్పు వచ్చింది. ఎవ్వరిలో యే మార్పు వచ్చినా కాలంలో మార్పు వుండదు. ముందుకు దూసుకుపోతూం టుంది. ఎవ్వరికోసం ఆగదు. వెనక్కి చూడదు. అలాటి కాలంతో మనం అడుగు వేయకతప్పదు. మన పనులు మనం చూసుకోక తప్పదు.

ఆడుకుంటున్న సుందర్ క్రిందపడ్డాడు. ఏడుస్తున్న బాబును పనిపిల్ల ఎత్తుకుని రమ్య దగ్గరకు వచ్చింది. బాబు ఏడుపుతో ఆయాసం వచ్చింది. ఊపిరి అందనట్లు కళ్లు పైకి తేలేశాడు.

ఎలా వుందో అలాగే రిక్షాలో ఎక్కి ఆసుపత్రికి వచ్చింది. వసుంధరను వెతుక్కుంటూ వచ్చి బాబును వసుంధరను చేతుల్లో వుంచింది.

రమ్యకు దుఃఖం ఆగటల్లేదు. ఆవుకోటానికి విశ్వప్రయత్నం చేస్తోంది. ఆ చిన్న ప్రాణానికి అంత బాధ ఏమిటి?

దుఃఖం రమ్యను కప్పేసింది.

వసుంధర బాబును పడుకోబెట్టి ఇంజక్షన్లు చేసింది. ప్రక్కలు ఎగురువేయటం నిమ్మళించింది. ఊపిరి అందుకున్నాడు. శ్వాసక్రియ మామూలుగ వచ్చింది.

"రమ్యా! హార్ట్ స్పెషలిస్ట్ ఇప్పుడు హైదరాబాదుకు వచ్చారట, నాన్నగార్కి మంచి స్నేహితుడు.పిలిపించుదామనిఅనుకుంటున్నాను...!!"

"డాక్టర్! మీ మేలు ఈ జన్మలో మరచిపోను." రెండు చేతులెత్తి నమస్కరించింది.

నిద్రపోతున్న బాబు పాదాలపై చేతులుంచి కూర్చున్న రమ్యను పరీక్షగా చూసింది వసుంధర.

తల చెరిగిపోయింది. చీర నలిగింది. నిన్న అల్లిన జడ మెలికలు తిరిగింది. దుఃఖభారంతో కృంగిపోయింది. అయినా... ప్రేమను వర్షింప చేస్తున్న కన్నులు కాంతిగ వున్నాయి. మూర్తీభవించిన మాతృత్వంతో ఒదో రకమైన అందంతో, ఏదో ప్రకాశం ఆమె చుట్టూ వెలుగుతుందనిపిస్తోంది.

రమ్యను చూస్తుంటే ఎన్నడు కలుగని కోరిక కలిగింది. "మాతృత్వంలో అంత తీయదనం, ప్రేమ వుందా?" అని రమ్యను ప్రశ్నించింది.

"అంత కోరికగ వుంటె, సుందర్‌ను పెంచుకో రాదు! మీరే బాబుకు తగిన తల్లి అనిపిస్తోంది బాబు మీ చేతుల్లో ప్రాణభయం లేకుండ పెరుగు తాడు. మీ చేయి తగిలితే చాలు చల్లగ నిద్రపోతాడు. బాబు ఎప్పుడు మీ సమక్షంలో మీ కనుసన్నలలో పెరగాలనిపిస్తుంది.

మీరైతే దగ్గర వుండి ఆపరేషన్ జరిపిస్తారు. నూరేళ్ల జీవితం బాబుకిస్తారు.

వసుంధరగారూ! ప్రతి తల్లి డాక్టరైతే ఎంత బాగుంటుంది! జబ్బుల రాకాసి నుండి కాపాడు కుంటుంది!!" అంటూ రమ్య మెత్తగ నవ్వింది.

"మాటలవరకే! నిజంగ నీవు బాబును నాకిస్తావా!!" రమ్య నిద్రపోతున్న బాబు వైపు దీర్ఘంగ చూసింది.

"మీరు స్వీకరించాలేగాని హృదయపూర్వకంగా ఇస్తాను!" వసుంధర నవ్వింది. ఆ నవ్వుకు ఎన్నో అర్థాలు చెప్పకోవచ్చు.

వసుంధర మనస్సు అవమానంతో కాలిపోయింది. నిన్న శ్రీకాంత్ స్వర్గపుటంచులవరకు తీసుకువెళ్లి అక్కడనుండి జారవిడిచాడు. నేరుగా పాతాళంలోకి పడిపోయింది.

ఉద్రేకంతో ఉత్సాహంతో యవ్వనం పుప్పొంగి పోయింది. ప్రేమించిన ప్రియుడికి తన ప్రాణమె పువ్వుగా చేసి అర్పించుకుంది. ఆ కుసుమాన్ని



ధర్మపథం

# ప్రార్థనా విలంబం

— బులుసు వేంకటరమణయ్య

రోగానికి ఔషధం ఎటువంటిదో మనోవేదనకు ప్రార్థన అట్టిది. మనస్సులో కలతపాటుకు చోటు లేకుండా ఉండడానికి, ప్రతి రోజూ తీరిక చేసుకొని కొంచెంసేపయినా దైవప్రార్థన చేస్తూ ఉండాలి.

ఒక వూళ్ళో ఒక గృహంలో భార్యాభర్తలుండేవారు. భార్యకు దైవభక్తి ఎక్కువ. ఇంటి పనులు చేసుకుంటూ ప్రతి దినమూ ఏదో ఒక వేళలో దైవప్రార్థన చేస్తూ ఉండేది. ఆమె భర్తకు లౌకిక వ్యవహారంమీదనే ఆసక్తి. క్షణం తీరిక లేకుండా ఏవో పనులు చేస్తూనే ఉండేవాడు. "ఇన్ని పనులు చేస్తున్నారు. దైవ ప్రార్థన కూడా ఒక పనిగా పెట్టుకొని కొంత సమయం దైవప్రార్థనకు కూడా ఉపయోగించండి" అని ఆమె చెప్పిచూచింది. అతని తల కెక్కలేదు. "ఎన్నో పనులున్నాయి. వాటికే సమయం చాలకుండా ఉన్నది. ఇక దైవ ప్రార్థనకు తీరిక ఎక్కడిది? వయస్సు మళ్ళాక యిన్ని పనులు చెయ్యలేను కదా! అప్పుడు దైవ ప్రార్థనకు కావలసినంత సమయం ఉంటుంది. అప్పుడు చేస్తానులే" అనేవాడు. భార్య ఎన్నిసారులు చెప్పినా అతడు పట్టించుకోలేదు. ఆమె విసిగి వేసారింది. "ఆయనను ఎలాగు దారిలోకి తేవడమా?" అని ఆలోచనలో పడింది.

ఒకప్పుడు పెనిమిటికి జ్వరం వచ్చింది. వైద్యుడు వచ్చి చూచి కొన్ని మాత్రలు ఇచ్చి ఎప్పుడెప్పుడు వేసుకోవాలో చెప్పి వెళ్లిపోయాడు. భార్య, ఆ మాత్రలను తీసి భద్రంగా ఒకచోట ఉంచింది. వైద్యుడు వెళ్ళాక భర్త "ఇప్పుడు మాత్రలు వేసుకోవాలి. తీసుకు రా" అని అన్నాడు. ఏదో పని చేస్తున్న భార్య "పనిలో వున్నాను. అది అయ్యాక తీసుకుని వస్తాను" అని చెప్పింది. మరికొంతసేపు పోయాక అతడు మళ్లీ అడిగాడు. "కొంచెం నిదానించండి. పని తెమలలేదు. తొందరేమిటి? మరికొద్దిసేపట్లో తెస్తాను" అని చెప్పి వెళ్లిపోయింది. ఇలా ఒక పూట గడిచిపోయింది. అతడు కోపంతో "నా జ్వరం తగ్గాలా, లేదా? ఇంత ఆలస్యం చేస్తే ఎలా?" అని గట్టిగా అన్నాడు. "నిదానించండి. మనస్సు ఏ రోగం లేకుండా వుండడానికి అవసరమైన దైవప్రార్థన నిదానంగా జరగవలసి నప్పుడు, శరీర రోగానికి మందు తీసుకోవడంలో కొంత ఆలస్యమయితే గాభరా ఎందుకు?" అని ఆమె అన్నది.

అప్పుడు అతని కర్థమయింది. శారీరకంగా మందులు అవసరమైనట్లే మానసికంగా ప్రార్థన ఉన్నప్పుడే అన్నివిధాలా మేలుకలుగుతుందని అతడు గ్రహించాడు.

(భగవాన్ శ్రీ సత్యసాయీ చిన్నకథ ఆధారంగా)

## రాగ జ్వాల

హృదయానికి చేర్చుకున్నట్లే చేర్చుకుని విసిరి పారేశాడు. అలాటి అవమానాన్ని యే అభిమానవతి భరించలేదు.

వసుంధర అవమానాగ్నిలో తన శరీరం కాలిపోతుందా అనుకుంది. ఆ శరీరాన్ని త్యజించాలని పించింది. జీవితం తుచ్ఛమనుకుంది. శ్రీకాంత్ తనలో రగిలించిన జ్వాల ఇంకా సెగలు గ్రక్కుతూంది. ఆ బడబాగ్ని హృదయంలో దాక్కుంది. అది చల్లారాలంటే — శ్రీకాంత్ తనవాడు కావాలి. శ్రీకాంతుడే ఆ అగ్నిని చల్లార్చగలవాడు...

"రమ్యా! నీవు బాబును ఇస్తానంటున్నావు. నేను ఇష్టంగా తీసుకుంటాను. కాని తండ్రి లేని బిడ్డకు ఏ గౌరవం వుంటుందీ... ఆ బిడ్డను పెంచటం హాస్యాస్పదం కాదా! లోకం వూరుకుంటుందా! రేపు ఆ బిడ్డ నాదే అని పుకారు పుట్టిస్తుంది..."

తల వంచుకుని వున్న రమ్య "బాబు తండ్రి నీవాడైనాడు కదా!" రమ్య గొంతు బొంగురు బోయింది.

రమ్య వర్షానికి భయపడుతుందని తన కౌగిలి విడిపించుకుని వర్షంలో తడుస్తూ వెళ్లిన శ్రీకాంత్ గుర్తుకు వచ్చాడు.

"అతను నా స్వంతం కాదుగా! తాత్కాలికమైన వ్యామోహం ఎన్నాళ్ళుంటుందీ! అందుకే... పెళ్లితో ముడి వేసుకోవాలనుకుంటున్నాను" గుండె వేగంగా కొట్టుకుంటూండగ మెల్ల స్వరాన వసుంధర అంది.

కొన్ని నిముషాలు మౌనం వారిద్దరి మధ్య నాట్యం చేసింది.

రమ్య చూపులతోనే బాబును తడిమింది. ప్రతి అవయవమూ ముద్దు పెట్టుకుంది. దేవుని స్మరిస్తూ దీర్ఘాయుష్మవుగా తన ఆయుస్సు తీసుకుని, మార్కండేయునిలా కలకాలం బ్రతకమని దీవించింది.

మెల్లిగా లేచి అంజలి ఘటించి వసుంధరతో 'ఇక వెళ్తాను!' అని చెప్పి మెత్తగ నిష్క్రమిస్తున్న రమ్యను ఆశ్చర్యంగ చూసింది.

"రమ్యా!... బాబును నా దగ్గర వదలి వెళ్తున్నావు! నామీద నీకు అంత నమ్మకం వుందా?" ముందుకు వెళ్తూ అడిగింది.

"కన్నతల్లి ప్రేమను ఎవ్వరు ఇవ్వలేరు. మీరు అమితంగా ప్రేమించలేకపోవచ్చు ... కాని మీ మీద నాకు పూర్తిగా నమ్మకం వుంది. ఏనాడు మీరు మీ కృతి ధర్మాన్ని విస్మరించరు. ఆ నమ్మకంతోటే బాబును మీకు అప్పగించి వెళ్లి పోతున్నాను."

వెళ్లిపోతున్న రమ్యలో దుఃఖం లేదు, ఈర్ష్య ఛాయలు లేవు. ఆత్మశాంతి కోసం అన్వేషిస్తూ వెళ్లే సన్యాసినిలా గోచరించింది.

అలా వెళ్లిన రమ్యను మళ్లీ చూడలేదు వసుంధర.

శ్రీకాంత్ పిచ్చివాడిలా వాడ వాడ, వూరు వూరు తిరిగాడు — వెతికాడు. రమ్య ఎక్కడా కనపడలేదు. గాలిలో కలిసిపోయినట్లు మాయమైపోయింది. శ్రీకాంత్‌కు రోజులు దినదిన గండంగా గడుస్తున్నాయి. ఎక్కడ ఏ దుర్వార్త వినవలసి వస్తుందోనని ప్రాణాలు బిగపెట్టుకుని గడుపుతున్నాడు.

మరో అమ్మాయిని చూస్తే నిన్ను వదిలి వెళ్లిపోతానన్నదే కాని చచ్చిపోతానని అనలేదు. ఆ ధైర్యంతోనే ఇంకా బ్రతికివున్నాడు.

రమ్య తప్పక వస్తుంది. తన కోసం కాకపోయినా బాబు కోసం వస్తుంది. తల్లిప్రేమ పగ్గం వేసి లాగదా! అన్న ఆశతో వున్నాడు.

రోజు — మరో రోజుకు ఎదురు చూడటంతోనే సరిపోతోంది శ్రీకాంత్‌కు.

"రమ్యా! రమ్యా!" అంటూ శ్రీకాంత్ హృదయం ఆలమటించసాగింది.

"రమ్యా! పరస్త్రీ నీడ నా మీద పడితే సహించలేని నీవు నీ కొడుకు కోసం నన్ను వదిలేశావు. నేను నీ భర్తను మాత్రమే! అందుకే వదిలేశావు.

రమ్యా! వసుంధర సహకారంతో జనరల్ మేనేజరునై శుభ్రమైన ఆ ఇంట్లో మిమ్మల్ని వుంచాలని వసుంధరకు వున్నట్లు — నిన్ను రంగు రంగుల చీరల్లో చూడాలని, అతి మధురమైన నీ శరీరాన్ని నగలతో జిగేల్ మనిపించాలని, బాబు కోసం, నీ కోసం వ్యభిచరించాను. కాని, నీవు బాబు కోసం నా బ్రతుకునే అమ్మేశావు.

రమ్యా! నా బ్రతుకనే సూర్యుడు అప్పుడే క్రుంగిపోయాడు నా హృదయ ఘోష నీ దాక రాటల్లేదా! రమ్యా! రమ్యా!" అంటూ పసిపిల్లవాడు తల్లికోసం ఏడ్చినట్లు వెక్కి వెక్కి ఏడ్చాడు.

ఆ దుఃఖంలో ...

శ్రీకాంత్ తనకొక కొడుకు వున్నాడని మరచి పోయాడు. బాబు బాధ్యత అంతా వసుంధరమీద పడింది. ఆయాని పెట్టి స్పెషల్ నార్సరీలోవుంచి అన్ని సౌకర్యాలు అమర్చింది. వసుంధరకే కాదు, ఆసుపత్రిలో వున్న వారందరికీ ముద్దుబిడ్డ అయ్యాడు.

శ్రీకాంత్ ఆ షాక్ నుంచి తేరుకుని మామూలు మనిషి అయ్యాక వివాహం విషయం ఎత్తవచ్చు — అని అనుకుంది. ప్రేమించి పెళ్లిచేసుకున్న ఆమె కోసం ఆ మాత్రం బాధపడటం న్యాయమే!

ఆరాటపడటంలో తప్పలేదు. తిరిగి కొత్త జీవితం ప్రారంభిస్తాడు. తన సహకారంతో రమ్యను మరిపిస్తుంది, మురిపిస్తుంది. మనిషి బ్రతకటానికి ఆహారమెంత అవసరమో ఓ మగవాడి జీవితానికి ఆడది అంతే అవసరం.

శ్రీకాంత్‌కి ఆ ఆడది తనే అవుతుంది. శ్రీకాంత్ తన వాడైన రోజు బాబును ఇంటికి తీసుకువెళ్తుంది. వసుంధర ఆ రోజు కొరకు ఎదురు చూస్తోంది. [ఇంకా వుంది]

**కాల్షియంలోపించిన ఎముకలు బలహీనంగా ఉంటాయి.**
**సులభంగా దెబ్బ తింటాయి.**

# కాల్షియం-శాండోజ్
# ఎముకల నిర్మాణాన్ని బలపరుస్తుంది

ఎముకలు కంటికి కనిపించవు. అయినా అవి మీ పిల్లల పెరుగు దలకు, వికాసానికి అతిముఖ్యమైనవి. కాల్షియం ఎముకలలోను, పళ్లలోను గల అతిముఖ్య పదార్థ భాగం. కాల్షియం లోపం వల్ల ఎముకలలో బలహీనత పెళుసుతనం సంభవిస్తాయి. పళ్లు వదులై చిల్లులు పడిపోతాయి.

శక్తివంతమైన పళ్లకోసం, ఆరోగ్యవంతమైన ఎముకలకోసం మీ బిడ్డడికి రోజుకు 3-4 వెనిల్లా వాసనగల కాల్షియం-శాండోజ్ బిళ్లలు ఇవ్వండి. ప్రతి బిళ్లా కాల్షియంతోపాటు C, D, $B_{12}$, విటమిన్లతో పటిష్టం చేయబడింది.

మీ బిడ్డడు ప్రతి రోజూ కాల్షియం కోల్పోతాడు. అది తిరిగి సమకూర్చాలి. లేకపోతే అతని పెరుగుదల దెబ్బతింటుంది. మామూలు భోజనం కావల్సినంత కాల్షియం ఇయ్యలేక పోవచ్చు.

**ఈ రోజే అతనికి కాల్షియం-శాండోజ్ ఇవ్వడం మొదలు పెట్టండి-ఎక్కువ ఆలస్యం అయిన తర్వాత ఎంత కాల్షియం యిచ్చినా కాల్షియం లోపంవలన కలిగిన హానిని మరమ్మతు చేయటం సాధ్యం కాదు.**

గుర్తుంచుకోండి. అన్ని కాల్షియం బిళ్లలు ఒకటేకావు.

**కాల్షియం—శాండోజ్**
**మాత్రమే కావాలని అడగండి.**
**మారుగా యిచ్చే ఏ యితర వాటి**
**తోను సరిపెట్టుకోకండి.**

కాల్షియం-శాండోజ్—
స్విట్జర్లండులోని శాండోజ్
వారిచేత పెంపొందించ
బడిన అత్యుత్తమ
మైన కాల్షియం.



**గట్టిపళ్ళు, పటిష్టమైన**
**ఎముకల కోసం**
**కాల్షియం-శాండోజ్®**




daCunha/S-25 Rev/TL




డాక్టర్ దగ్గరనించి ఇంటికి వచ్చాక అన్నాడు మురళి సరోజతో, ''నా కిష్టం లేదు'' అని.

''ఏమిష్టంలేదు'' అడిగింది సరోజ, మురళిని పట్టుకుని నడిపించుకువెడుతూ.

''అదే ఆ డాక్టర్ ఆపరేషన్ చేయాలన్నాడు కదా ! నాకు ఆపరేషన్ చేయించుకోవటం యిష్టంలేదు'' సరోజ భుజంమీద నించి చేతులుతీసి, మంచంమీద కూర్చుంటూ అన్నాడు మురళి.

పకపకా నవ్వింది సరోజ – ''ఎవరూ యిష్టంవుండి సరదాగ ఆపరేషన్ చేయించుకోరు బుజ్జీ. అవసరమయితేనే చేయించుకుంటారు !'' అన్నది.

మురళి అన్నాడు ''నీకు నవ్వులాటగానే వుంటుంది. ఆపరేషన్ చేయించుకోవలసింది నేను కదా మరి !''

సరోజ నెమ్మదిగా అన్నది ''అది కాదండీ. మైనర్ ఆపరేషనే అన్నాడు కదా ఆయన. ఇందులో భయపడాల్సినదేముంది ?''

''అన్నాడనుకో ... కానీ ... '' నసిగాడు మురళి.

రెండురోజుల క్రితం నాంపల్లి దగ్గర, బాగా స్పీడుగా, స్టాప్‌లో ఆగకుండా ప్రగతి పథంలో పయనిస్తున్న ఆం. ప్ర. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థవారి సిటీబస్సుని, పరుగెత్తుతూ అందుకోబోయి, అందుకోలేక దాన్నుని క్రిందపడ్డాడు మురళి. ఆ రోజు సాయంత్రానికల్లా కాలువాచి, నొప్పి చేసింది.

ప్రభుత్వ ఆసుపత్రిలో అన్ని పరీక్షలూ చేసిన ఆర్థోపెడిక్స్ డాక్టర్‌గారు–ఆపరేషన్ చేయాలని నిశ్చయించారు.

మురళి పడుకున్న మంచం ప్రక్కగా కుర్చీ లాక్కుని, అందులో కూర్చుని అన్నది సరోజ ''అసలింతకీ మీ అనుమానం ఏమిటో చెప్పండి ?''

మురళి మాట్లాడలేదు.

''డాక్టర్ ఆపరేషన్ చేయించుకోవటం అవసరం అన్నాడు. రేపు వచ్చి హాస్పిటల్లో ఎడ్మిట్ కూడా అవమన్నాడు. మరి అలాటప్పుడు మీరు ఆపరేషన్ చేయించుకోనంటే ఎలా ? జీవితాంతం కుంటుతానంటారా ! ఈ నొప్పి అలానే భరిస్తానంటారా ?''

''అది కాదు సరోజా... నాకు ఆపరేషనంటే యిష్టంలేదు.''

''ఆపరేషన్ అంటే ఎవరికి మాత్రం యిష్టం వుంటుందండీ... ఏదో అవసరం వచ్చింది కాబట్టి చేయించుకోవాలి కానీ...''

''ఊఁ !... ఊఁ !... ప్చ్ ... ప్చ్ ...'' సణుగుతున్నాడు మురళి.

''అసలు ఏమిటి మీ భయం !''

''ఆపరేషనంటే నాకేం భయం లేదు సరోజా... కానీ...''

అతను చిన్నపిల్లవాడిలా అలా అంటుంటే నవ్వు వచ్చింది సరోజకు. ''కానీ... చేసే డాక్టరంటే భయమా...''

ఒక క్షణం సూటిగా సరోజని చూసి అన్నాడు మురళి – ''ఒక విధంగా అంతే అనుకో !''

''ఆ డాక్టర్ పాపం ఎర్రగా బుర్రగా అందంగానే వున్నాడే...''

''అదికాదు సరోజా... నా మనసులోని మాట చెబుతాను విను... కానీ మధ్యలో నవ్వకూడదు మరి...''

''ఊఁ ! చెప్పండి మీ అనుమానాలేమిటి ?''

మురళి మాట్లాడకుండా ఆలోచిస్తు

న్నాడు. ఉన్నట్టుండి అన్నాడు – "పోనీ త్రివేండ్రం వెళ్ళి, అన్నయ్యవాళ్ళ యింట్లో వుండి – ఆ వూళ్ళోనే ఆపరేషన్ చేయించుకుంటే..."

"ఏం... ఆ మాత్రం డాక్టర్లూ, హాస్పిటల్సూ యిక్కడ లేవనా!" వింతగా చూసింది సరోజ.

"అలా అనికాదు – పోయినసారి అన్నయ్య ఇక్కడికి వచ్చినప్పుడు చెప్పాడు. అక్కడ హాస్పిటల్స్‌లో జనరల్ వార్డ్సు, మన పేవార్డ్సుకన్నా చాల నయమని, డాక్టర్లు కూడ పేషంట్స్‌ని పీడించుకు రక్తం తాగరనీ, పెద్ద పెద్ద డాక్టర్లు కూడా అందరికీ అందుబాటులో వుంటారనీ..."

"అంతేనా – ఆపరేషన్లు కూడా అక్కడ బాగా చేస్తారని చెప్పారా ..." నవ్వింది సరోజ.

"అదికాదు సరోజా! వదినకి అక్కడ సిజేరియన్ చేసినప్పుడూ, తరువాత వాళ్ళ పెద్దబ్బాయికి హెర్నియా ఆపరేషన్ చేసినప్పుడూ అన్నయ్య దగ్గరే వున్నాడు కదా. మన హాస్పిటల్స్‌కీ, డాక్టర్స్‌కీ – అక్కడి హాస్పిటల్స్‌కీ, డాక్టర్స్‌కీ చాలా తేడా వుందని అన్నాడు."

"అయితే అవచ్చు కానీ – ఇక్కడ కూడా పేరుపడ్డ డాక్టర్లు చాలామంది వున్నారు. కాకపోతే వీళ్ళకి కొంచెం ఆకలెక్కువ. ప్రభుత్వ ఆస్పత్రి అని పేరే అయినా, స్వంత హాస్పిటల్స్‌లోలాగా ఛార్జీలు వసూలు చేస్తారు. మన తాహతునిబట్టి ఆ మాత్రం యివ్వలేక పోము. అదీకాక త్రివేండ్రం కానీ, యింకో వూరు కానీ పోవాలంటే బోలెడు ఖర్చు. అదేదో ఈ డాక్టర్ మొహానే కొడితే, జాగ్రత్తగా చూసుకుంటాడు"అన్నది సరోజ.

"అవుననుకో ..." నసిగాడు మురళి.

"ఇంతకన్నా కూడా మీ మనసులో ఏదో వుంది. ముందా విషయాన్ని బయటకు రానీయండి!" అడిగింది సరోజ.

"సరోజా! గుంటూరు, కాకినాడ, హైదరాబాద్, విశాఖపట్నం ఆసుపత్రులలో జరిగిన ఘోరాలు చాలా చదివాను పేపర్లలో. అంతేకాక ఈ డాక్టర్ల ప్రయోజకత్వం గురించి కూడా చాలా విన్నాను. అదే నా భయం. ఆ కేసుల తలుచుకుంటేనే ఒళ్ళు గగుర్పాటు చెందుతుంది ..." ఆగాడు.

సరోజ మాట్లాడలేదు. మురళినేచూస్తూ కూర్చున్నది.

సన్నగా నవ్వాడు మురళి "నా విషయంలో కూడా అలానే జరుగుతుందని నేను అనను. కానీ జరిగినకేసులు ఎంతఘోరంగా వున్నాయో చూశావా ... మొన్న ఈ వూళ్ళోనే ఒక మూడేళ్ల చిన్నపిల్లకు, ఒక కన్ను క్యాన్సర్ వల్ల దెబ్బతింటే, ఆ కన్నుతీయబోయి – రెండో కన్ను తీసివేశారుట. ఇప్పుడా అమ్మాయి బ్రతకాలంటే, ఆ కాన్సర్ కన్ను కూడా తీసి వేయాల్సిందే. అంటే రెండు కళ్ళూలేని కబోది అవుతుందన్నమాట. డాక్టర్ల నిర్లక్ష్యం, ఒక నిండు జీవితంలో ఎంతటి చీకటిని నింపిందో చూశావా? అలాగే కొన్నాళ్ళక్రితం యింకో హాస్పిటల్లో అప్పుడే పుట్టిన పసికందు, తల్లి మంచం పక్కన వున్న వుయ్యాలలో కన్పించలేదు. చివరకు అందరూ వెతగ్గా, బయట ఆవరణలో ఒక కుక్క ఆ పసికందుని తినటం కనపడిందిట. ఉయ్యాలలోని పసికందుని, కుక్క ఎలా లోపలకు వచ్చి నోట కరుచుకుని, బయటకు పోయిందో, ఆ హాస్పిటల్లోని స్టాఫ్‌కే తెలియాలి..."

"అవును... ఈ విషయాలు నేనూ విన్నాను. కానీ ఎప్పుడూ యిలా ఎందుకు జరుగుతాయి..."

"ఎప్పుడూ జరుగుతాయా లేదా అనికాదు మనం ఆలోచించాల్సింది. అప్పుడప్పుడు మాత్రం ఎందుకు జరగాలని. ఒక మనిషి ప్రాణానికి సంబంధించిన విషయంలో, నిర్లక్ష్యం అనేది ఎందుకు రావాలి అని – మన రాష్ట్రంలోనే యింకో ప్రభుత్వ ఆసుపత్రిలో ఏం జరిగిందో తెలుసా? ఒక రోగికి ఆపరేషన్ చేస్తున్నప్పుడు, ఆక్సిజన్ కావాల్సివచ్చింది. మామూలుగా అయితే ఎప్పుడూ ఆక్సిజన్ సిలెండరు పక్కనే సిద్ధంగా వుండాలి. ఆరోజు కూడా సిలెండర్ అయితే వుంది కానీ, దాంట్లో ఆక్సిజన్ మాత్రం లేదు. హాస్పిటల్ అంతా వెదికినా, ఆక్సిజన్ దొరకలేదు. ఈలోగా ఆపరేషన్ టేబుల్‌మీద వున్న పేషెంటు 'హరీ' అన్నాడు. ఒకరి నిర్లక్ష్యం, యింకొకరి ప్రాణాల్నెలా హరిస్తుందో చూశావా. ఇలాటి కేసులు ఎన్నో చదివాం పేపర్లలో..."

"మరి అంత నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తున్న డాక్టర్లూ, తదితర స్టాఫూ, హాస్పిటల్ సూపరింటెండెంట్స్‌మీదా ప్రభుత్వం, ఏ చర్యా ఎందుకు తీసుకోవటంలేదు?"

అదోలా నవ్వాడు మురళి – "తీసుకుంటూనే వున్నాం అనే అంటుంటారు అధికారులు, అసెంబ్లీలోని పెద్దమనుషులు. అదంతా యింకో తలనొప్పి వ్యవహారంలే..."

"ఇలాటివి ప్రతి రాష్ట్రంలోనూ జరుగుతూనే వున్నాయి..." అన్నది సరోజ.

"కానీ మన రాష్ట్రంలో ఎక్కువగా వింటున్నాం ఇలాటివి..." అంటూనే కాలు ఎత్తుకున్నాడు "అబ్బా" అంటూ బాధతో మురళి.

డాక్టర్ యిచ్చిన ఆయింట్‌మెంటుని పైపైన నెమ్మదిగా మర్దన చేసింది సరోజ.

కాసేపటికి తేరుకున్నాడు మురళి. సరోజ కళ్లల్లోకి సూటిగా చూసి "నిన్ను బాగా కష్టపెడుతున్నాను సరోజా" అన్నాడు.

సరోజ అతన్ని లాలనగా చూసి "ఇందులో కష్టపడిందేముంది" అన్నది.

సరోజను దగ్గరకు తీసుకున్నాడు మురళి.

మర్నాడు ప్రొద్దున లేచిన వెంటనే, కిచెన్‌లో పని చేసుకుంటున్న సరోజను పిలిచాడు మురళి.

"సరోజా! రాత్రల్లా ఆలోచించాను. ఇవాళే హాస్పిటల్లో చేరదాం. ఆపరేషన్ చేయించుకుంటాను. ఇవాళే చిక్కడపల్లికి ఫోన్‌చేసి ప్రసాద్‌ని రమ్మను. ఆపరేషన్ పూర్తయి, నేను మామూలుగా అయ్యేదాకా మనకి తోడుగా వుంటాడు" అన్నాడు మురళి.

వింతగా చూసిందతన్ని సరోజ.

"మరి మీ అనుమానాలన్నీ తీరినట్టేనా?" అడిగింది.

సన్నగా నవ్వాడు మురళి "ఆ విషయాలన్నీ పేపర్లలో చదివి వుండటంవల్లా, నలుగురి నోటా విని వుండటంవల్లా అనవసరంగా భయపడ్డాను. ప్రతిరోజూ ఈ దేశంలో ఎన్నో రకాల ఆపరేషన్లు కొన్ని వేలు జరుగుతున్నాయి. వాటిల్లో అశ్రద్ధ కారణంగా ఫెయిలయ్యేవి చాలా తక్కువ. అలాటి మూడు నాలుగు కేసుల్ని చూసి భయపడటం శుద్ధ అవివేకం!" అన్నాడు మురళి.

"వెరీగుడ్. అయితే ఒక క్షణం వుండండి వేడివేడి కాఫీ యిస్తాను" అంటూ లోపలికి వెళ్లింది సరోజ.

ఆ రోజే మురళి ఆసుపత్రిలో స్పెషల్ వార్డులో ఎడ్మిట్ అయ్యాడు. ప్రసాద్‌వచ్చి ప్రక్కనే సహాయంగా వున్నాడు. డాక్టర్‌వచ్చి పరీక్షచేసి "రేపు ప్రొద్దున్నే ఆపరేషన్ చేద్దాం. నేను అన్నీ సిద్ధం చేయిస్తాను. మీరేమీ గాభరాపడనవసరం లేదు. యు విల్ వాక్

## చావనున్నవారికి తోడు!

ఇటీవల పశ్చిమ జర్మనీలో కొంత మంది శిక్షణను పూర్తిచేసుకుని "మృత్యు సహచరులు" అని పిలవబడేందుకు అర్హులైనారు ఈ పేరు విడ్డూరంగా వున్నప్పటికీనీ, వీరు చేసేది మాత్రం మానవ సేవే ఒంటరిగా చివరి క్షణాలలో మృత్యువు నెదుర్కొనలేక క్రుంగిపోతున్నవారికి అండగా నిలచి వారి మంచిచెడ్డలను చూడటమే వీరి కర్తవ్యం ఎవరూ కూడా ఒంటరిగా పిలిస్తే పలికేవారు లేక, బాధను పంచుకునేవారు లేక అనాధలై చనిపోకూడదనే మానవతా సిద్ధాంతాన్ననుసరించి యీ మృత్యు సహచరులకు శిక్షణ నివ్వడం జరిగింది. బంధువులు లేక ఆసుపత్రి అధికారులు చనిపోతున్న రోగులను అంటిపెట్టుకుని వుండటం అంతగా సాధ్యమయ్యే పని కాదని భావించారు పశ్చిమ జర్మనీలోని బేడన్ ఆసుపత్రిలో యేటా 500 మంది చనిపోవడం జరుగుతున్నది. ఎప్పుడూ 70 లేక 80 మంది వెయిటింగ్ లిస్టులో వున్నప్పటికినీ, వీరిని ఆసుపత్రిలో చేర్చుకొనడానికి ఆఖరి క్షణాలలో వున్న రోగులను మానవతా దృష్టితో యిండ్లకు పంపటం మాత్రం జరగదు. అయినా వీరికి ఆఖరి క్షణాలలో వున్నవారిని సరిగా చూడటంలేదనే అపవాదు మాత్రం తప్పటంలేదు అందువలన ఆసక్తి కలవారిని ఎంపిక చేసి యీ శిక్షణనిచ్చి చావు–నేస్తాలుగా పిలుస్తున్నారు ఈ శిక్షణ పొందిన వారిలో గృహిణులు, ఆఫీసు ఉద్యోగులు, టీచర్లు వున్నారు.

నార్మల్లీ ఆఫ్టర్ ది ఆపరేషన్. రేపొద్దున్నే వచ్చి చూస్తాను!" అని ఆయన వేరే పేషెంట్సుని చూడటం కోసం వెళ్లిపోయాడు

మరునాడు ఆపరేషన్ థియేటర్‌లోకి స్ట్రెచర్‌మీద తీసుకువెడుతున్నప్పుడు, అక్కడే కళ్లనీళ్లు పెట్టుకొని నుంచునివున్న సరోజను చూసి, చిన్నగా నవ్వాడు మురళి సరోజ దగ్గరకు వచ్చింది —

"నాకేం భయంలేదు సరోజా! ఎందుకా కన్నీళ్లు — చిన్న ఆపరేషనే కదా!" అన్నాడు మురళి

ప్రసాద్ అన్నాడు "ఒక గంటలో ఆపరేషన్ అయిపోతుంది అక్కయ్యగారూ — ఈలోగా ఈ ప్రక్కనే కాంటీన్‌లోకి వెడదాం పదండి— కాఫీ త్రాగచ్చు" అంటూ సరోజను పక్కకు తీసుకువెళ్లాడు

ఆపరేషన్ థియేటర్లో, పైన వున్న పెద్ద లైట్లను చూస్తున్న మురళికి, ఒళ్లు వేడిగా వున్నట్లు అనిపించింది—అనెస్థీషియా, పూర్తి శరీరానికి యివ్వటంవలన, తర్వాత ఏం జరిగిందో కూడా తెలియలేదు అతనికి —

కళ్లు తెరచి చూసేసరికి, అతను రికవరీ రూంలో వున్నాడు ప్రక్కన సరోజ, ప్రసాద్ నుంచునివున్నారు సరోజ ముందుకు వచ్చి, మురళి తలమీద చేయి వేసింది

"సరోజా!" నీరసంగా అన్నాడు మురళి

"ఏమండీ — ఎలా వుంది!" అడిగింది సరోజ

"బాగానే వుంది — కానీ నీరసంగా వుంది!" అన్నాడు

# పెనుభూతం

"కాసేపు కళ్లు మూసుకు పడుకోండి - హాయిగా వుంటుంది!" అన్నది సరోజ

సన్నగా నవ్వాడు మురళి.

హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చినట్లు, చేత్తో తన రెండు కాళ్లు తడుముకున్నాడు

ప్రసాద్ నవ్వాడు "మురళీ! ఒక కాలుకి బదులు యింకో కాలుకి ఆపరేషన్ చేశారేమో నని భయపడుతున్నారా ఈ మధ్యనే ఎవరికో ఒక కాలు తీసేయబోయి రెండో కాలు తీసేశారుట"

మురళి కూడా యిబ్బందిగా నవ్వాడు "అదేం లేదు ప్రసాద్"

సరోజ అన్నది "అలాటివేం జరగలేదు లెండి — డాక్టర్ అన్నీ సక్రమంగా జరిగాయనీ, కుట్లు విప్పగానే యింటికి పంపించేస్తాననీ చెప్పాడు. నడకకూడా మామూలుగా వస్తుందనీ, ఏమాత్రం అనుమానం లేదనీ చెప్పారు!"

మురళి పైకి అనకపోయినా, అంతా సవ్యంగా జరిగినందుకు లోలోపల సంతోషపడ్డాడు తను అనవసరంగా అనుమానపడి, గాభరాపడ్డందుకు కొంచెం సిగ్గు పడ్డాడు కూడా.

వారం రోజుల తర్వాత కుట్లు విప్పదీశారు డాక్టర్ పరీక్షచేసి అంతా సవ్యంగానే వుందన్నారు.

తర్వాత యింకో రెండు రోజులు వుండి, డాక్టర్‌కీ, నర్సులకీ, అనెస్థీషియన్‌కీ, వార్డ్ బోయిస్‌కీ, తోటీలకీ యివ్వవలసిన ముడుపులూ, మామూళ్లూ యిచ్చి, అంబులెన్స్‌లో యింటికి చేరాడు మురళి

"సో — ఇకనే వెడతాను నా అవసరం వుంటే ఫోన్ చేయండి వస్తాను" అంటూ శెలవు తీసుకున్నాడు ప్రసాద్

సరోజ గేటుదాకా వెళ్లి, అతన్ని ధన్యవాదాలతో పంపించి వచ్చింది

"ఆపరేషన్ అయిన తర్వాత స్పృహ రాగానే ఎంత భయపడ్డానో తెలుసా! వాళ్లు ఏం ఆపరేషన్ చేశారో, ఎలా చేశారో అని ఇలాంటి అనుమానాలు సైకలాజికల్‌గా బ్రెయిన్‌ని చాలా ప్రెషరైజ్ చేస్తాయి సరోజా అసలు ఇటువంటి అనుమానాలు రానేకూడదు!" అన్నాడు మురళి

"అందుకే అనుమానం 'పెనుభూతం' అన్నారు!" అన్నది సరోజ

తర్వాత నాలుగురోజులు బాగానే గడిచాయి అయిదోరోజున నిద్రలేస్తూనే, ఆపరేషన్ చేసిన తొడ దగ్గర పట్టుకుని — "ఇక్కడెందుకో బాగా నొప్పిగా వుంది సరోజా" అన్నాడు మురళి

డాక్టర్ ముందే యిచ్చిన టాబ్‌లెట్స్ వేసింది సరోజ కాసేపు వూరుకుని, మళ్లా నొప్పి వచ్చిందనీ, యింకా ఎక్కువగా వుందనీ అన్నాడు మురళి

"హాస్పిటల్‌కి వెడదామా!" అడిగింది సరోజ.

"ఊఁ!" అన్నాడు బాధగా మురళి

ఫోన్ కాల్ అందగానే, అరగంటలో టాక్సీతో సహా వచ్చాడు ప్రసాద్

వెంటనే మురళిని హాస్పిటల్‌కి తీసుకువెళ్లాడు

డాక్టర్ మురళికి ఒక ఇంజెక్షన్ చేసి అక్కడే బెడ్‌మీద పడుకోబెట్టాడు.

ఎంతసేపటికీ నొప్పి తగ్గలేదు సరికదా, యింకా ఎక్కువ అవసాగింది. ఆ డాక్టర్ వెళ్లి, యింకో డాక్టర్నుకూడా పిలుచుకు వచ్చాడు. అతనుకూడా పరీక్ష చేసి, ఆపరేషన్ చేసిన ప్రదేశాన్ని ఎక్స్‌రే తీయించాడు తర్వాత ఇద్దరూ ఎక్స్‌రే పట్టుకుని ప్రక్క రూమ్‌లోకి వెళ్లి, ఒక పావుగంట తర్వాత బయటకు వచ్చారు.

బయట ఆత్రంగా నుంచునివున్న ప్రసాద్, సరోజలను చూసి — "మీరు యిక్కడే వుండండి. ఒక చిన్న ఆపరేషన్ చేస్తే, అంతా బాగవుతుంది — దేరీజ్ నో ప్రాబ్లం!" అంటూ మురళిని వెంటనే ఆపరేషన్ థియేటర్‌లోకి తరలించారు

"అసలు ఏమయింది డాక్టర్!" వెంటబడి అడుగుతున్న ప్రసాద్‌కి ఎవరూ జవాబివ్వ లేదు

ఆపరేషన్ థియేటర్ తలుపు మూసుకుంది

ఏమీ అర్థంకాక అయోమయంగా

# పెనుభూతం

చూస్తున్న సరోజతో అన్నాడు ప్రసాద్— "మీరేమీ గాభరా పడకండి — ఎవ్విరిథింగ్ విల్ బి ఆల్‌రైట్!" అని.

ఒక పావుగంట తర్వాత, ఒక నర్సు బయటకు వచ్చింది. యింకో నర్సుని పిలిచి ఒక చీటీ అందించి "వెంటనే రావాలి సుమా!" అన్నది.

ఆ నర్సుని సమీపించి "మురళి ఎలా వున్నాడు — అసలేం జరిగింది!" అడిగాడు ప్రసాద్

ఆమె ఏమీ మాట్లాడలేదు

మళ్లీ మళ్లీ అడిగాడు ప్రసాద్.

చివరకు ఆమె నెమ్మదిగా అన్నది "మీరేమీ కంగారు పడకండి — పోయినసారి ఆపరేషన్ చేసినప్పుడు పొరపాటున ఫోర్‌సెప్స్ లోపలే వుంచి కుట్టివేయటం జరిగింది ఇందాక ఎక్స్‌రే తీసినప్పుడు ఆ విషయం బయటపడింది వెంటనే ఆపరేషన్‌చేసి అది తీసివేయటానికి ప్రయత్నం చేస్తున్నాం ఈలోగా బ్లడ్ ఎక్కించాల్సిన అవసరం వచ్చింది. బ్లడ్ కోసం సిస్టర్ వెళ్లింది కూడను ..."

తర్వాత ఆమె చెప్పేదేదీ సరోజ చెవిన పడలేదు. ఒళ్లంతా చెమటలు పట్టి, స్పృహ తప్పి అక్కడే పడిపోయింది.

స్పృహ వచ్చాక, సరోజ కళ్లు తెరచి చుట్టూ చూసింది. తను మంచంమీద పడుకుని వున్నది. పైన ఫ్యాన్ గిరగిరా తిరుగుతున్నది. పక్కనే సపర్యలు చేస్తున్నది నర్సు

పక్కకు తిరిగి చూసింది సరోజ.

ప్రసాద్ ముఖం చేతుల్లో దాచుకుని ఏడుస్తున్నాడు.

"ఏమయింది . . ఆయనకెలా వుంది . ఆయన ..." నీరసంగా అడిగింది సరోజ.

"ఇంకెక్కడి మురళి...ఆపరేషన్ టేబుల్ మీదే మనందర్నీ వదలిపోయాడు వాడు . వాడి అనుమానమే యిప్పుడు నిజం అయింది . ." బావురుమన్నాడు ప్రసాద్

సరోజకి మళ్లీ స్పృహ తప్పింది. ★

# ప్రశ్నావళి * ప్రశ్నావళి * పశ్నావళి * ప్రశ్నావళి * ప్రశ్నావళి

### శంకర్. - ఉరవకొండ

నమ్మిన స్నేహితురాలు ద్రోహం చేస్తే ప్రతీకారం చేయాలంటాడు నామిత్రుడు. కాదు అది మనకర్మ అంటాన్నేను

★ ఋతి—అంటే ప్రతి అంటూ వాదించుకునే స్నేహితులెక్కువనుకుంటా ఆంధ్రలో! లేక పోతే ఏమిటి? ఇలాంటి పరసనల్ విషయంలో కూడా స్నేహితులు చెప్తేనేగాని బుర్ర పనిచేయదా. ప్రతీకార వాంఛ ఎప్పుడూ ఒకరినే తీయదు దెబ్బ ..

### కె వి ఆర్. —విశాఖపట్నం

ప్రతిదానినీ హేళనచేసే వ్యక్తులను ఏమనాలి?

★ ఏమీ అనక్కరలేదు రావుగారూ, వ్యక్తి హేళనచేసే విషయాలే అతని కారక్టరుని తెలియ చెప్తాయి!

### జి. ఎస్. ఆర్ - సికింద్రాబాద్

సినిమా తలపెడుతున్నారట తీయకలరా!

★ బాగుంది మీ పశ్న! ప్రయత్నమేనా చేయకపోతే—తీయకలనో లేదో ఎలా తెలుస్తుంది ?! ప్రయత్నించేదాకా — తామేంచేయకలరో— తమకే తెలియదు!

### డి వి ఆర్ సిహెచ్ ఎస్ - ఆదోని

బడుద్దాయిలందరూ రాజకీయ నాయకులు అయితే బాగుంటుందా? బడిపంతుళ్లుగా చేరితే బాగుంటుందా?

★ బడిపంతుళ్లయితేనే బెటరండీ — కనీసం పిల్లలేనా పాఠాలు చెప్తారు! రాజకీయవాదికి ఎత్తుకు పైఎత్తు వేయగల తెలివి వుండాలిట!

### కె. డి డి - ఖమ్మం

నేను పొట్టిగా వికారంగా వుంటాను. నేనంటే చులకన.

★ చూడు తమ్ముడూ — అందచందాలు మనిషి ముఖం చెప్తుంది మనస్సు కుళ్లిన మనిషి అందంగావున్నా కురూపే. మంచిమనస్సు ముఖానికి కళ .. కుబ్జ కురూపికాదా? శ్రీకృష్ణుని ఆదరణకి పాత్రురాలైన సుందరి! నిన్నుగురించి నువ్వే చులకన చేసుకోక అదే అందరికీ నిన్ను లోకువ చేస్తుంది.

### పి.వి పి., ఎస్ ఎస్. - కూనవరం

మీరు వేటూరిని, చక్రవర్తిని ప్రతి విషయంలో విమర్శిస్తారెందుకు?

★ విమర్శించను — తలుచుకుంటాను!! వారి కాంబినేషన్ — మాంచి వూపు వున్నది కనుక పదే పదే తల్చుకోడం తప్పకాదే ..

దాసరి నారాయణరావుగారి మేధస్సును మూడు ముక్కల్లో చెప్పకలరా?

★ ఎలా? జనం నాడి పట్టి జేబులు దోచేస్తూందే!! ఇంకా చెప్పడం ఎందుకు?

### ఫ్రాన్సిస్ - ఒంగోలు

పైసా సంపాదన లేకుండా భర్తతో సమాన హక్కులు కోరే ఆడాళ్లకు మీరిచ్చే .

★ వాళ్లకెందుకు — మీకు చెప్పాలి — పైసా సంపాదించని మగవాళ్లు అన్ని హక్కులూ అనుభవిస్తూ ఎక్కడా కనిపించలేదా? అయినా. భార్య చేసే సేవలకి "జీతం" యిచ్చుకోలేని వాళ్లందరికీ — హక్కులుండగా లేనిది భార్యల కంటే తప్పేమిటి ఫ్రాన్సిస్‌గారూ ?!

### ఎల్. వి. ఎస్. - భువనేశ్వర్

పిల్లి ఎదురైతే — అశుభం అంటారు ఆడపిల్ల ఎదురైతే?

★ ఏముంటుందీ శుభం?

### వి. వి. కె ఆర్ - హైదరాబాదు

కేను గొడవలకి మీకు కోపం రాలేదా?

★ కోపం తెచ్చుకోవడం — బలహీనతకు నిదర్శన అని నేను నమ్ముతాను. ఓర్పుగా సాధించ వలసిన విషయాలని కోపం తెచ్చుకుని ఎవరేనా చెడగొట్టుకుంటారా?

జీవితం బోరు కొట్టితే?

★ ఎలా? వినలేదా — అవివేకి — జీవితం ముగిసిపోతుందేమోనని భయపడతాడట విజ్ఞాని జీవితమింకా ఎప్పటికి ప్రారంభం కాను అని వాపోతాడట. అంచేత — జీవితంలో బోరు కొట్టే టైము వుండకుండా చూసుకోవాలి

కష్టం లేకుండా విజయం ఎప్పుడొస్తుంది?

★ రాదు. ఇంగ్లీషు డిక్షనరీలో అయితే "సక్సెస్" ముందూ "వర్క్" తరవాతా వస్తాయి!!

### కబీరు - అనంతపురం

మీ అభిప్రాయాలను చదివి నేటి మహిళలు హాయిగాసాగే సంసారాలలో కలతలు రేకెత్తిస్తున్నారు ఈ విధంగా చేయడం మీకు తగునా?

★ మంత్రాలకి చింతకాయలు రాలుతాయని నమ్మేటంత వెర్రివాణ్ని కానయ్యా! నా అభిప్రాయాలతో పనిలేకుండానే వస్తుంది మార్పు— రావలసి వచ్చినప్పుడు ఆడదాన్ని కట్టడి చేయగలరే గని ఆలోచించకుండా చేయలేరు!

### నాను, ప్రసాద్ - ఆండలూరు

మీరు ఇక్కడ కంటే రాజకీయాలలో అయితే బాగా రాణిస్తారు మంచి ముహూర్తం చూసి చేరిపోండి ...

★ కుదరదయ్యా! నా కింకా అంత గజ చర్మం ఏర్పడలేదు

### ఎస్ వి - హైదరాబాదు

ప్రశ్నలడిగే వాళ్లని మీర ఏమని తలుస్తారు?

★ ఎప్పుడూ తక్కువ అంచనా వేయనండీ, ఎదుటి వాళ్లని అంచనా కట్టేప్పుడు— నన్నువాళ్లూ అంచనా కట్టే వుంటారని గ్రహించనా?!

### ఫ్రాన్సిస్ ఒంగోలు

కె రా. గారూ! నటరాజు కాలుకింద ఏదో చిన్న బొమ్మ వుంటుంది ఎందుకు?

★ అదే అజ్ఞానం! కాల రాస్తున్నాడు నటరాజు

— కె. రామలక్ష్మి

## "పెద్ద మెదడు"

చిన్న మెదడా చిన్న మెదడా?
ఎన్నటికి నీ మేలు మరువను
పాత్తులో నేమున్న వేళల
చిత్తుగా పోరాడితివి మరి

సాంప్రదాయపు ముచ్చులందరు
చవటగా నన్నెంచినప్పుడు
కటువుగా తెగజెప్పితివి నా
కరినమౌ, నియమాల నిష్ఠల

పచ్చబతుకులు పాడుచేయగ
రెచ్చగొట్టిరి రచ్చబండల
నోర్లనాన్చిరి గేలిచేసిరి
నొప్పిపెట్టిరి గోలచేసిరి

ఓర్పు జాపుచు చాటితివి బహు
నేర్పుగా నా గట్టితనమును
భయములేదిక మత్తు విడిచితి
బాధ్యతల నా కప్పగింపుము

సాంప్రదాయపు చచ్చుగోడల
చదను చేసెద తుడిచి వేసెద
చిన్న మెదడా చిన్న మెదడా
ఎన్నటికి నీ మేలు మరువను!

— తనికంటి శేషాచలపతి

# మీ డబ్బుకి ఇంతకంటె మంచి రక్షణ అవసరం



ఫలానా చోట భద్రత ఉంటుందని గట్టిగా నమ్మి మీ డబ్బును అక్కడ దాస్తారు. ఆ నమ్మకం కాస్తా వమ్మయితే...! అలా జరిగే అవకాశాలు లేకపోలేదు. అందుకే - కష్టార్జితాన్ని ఎక్కడ మదుపు పెట్టాలా అన్న విషయంలో మీరు బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం చాలా ముఖ్యం.

రెండు దశాబ్దాల అనుభవం ఉన్న మార్గదర్శిలో మీరు పొదుపుచేసే మొత్తాలకు పూర్తి రక్షణ ఉంటుంది. అందరి అవసరాలకూ సరిపడే విధంగా వివిధ రకాల చిట్‌లు మార్గదర్శిలో మీకు అందుబాటులో ఉన్నాయి. అంతేకాదు, మీరు పొదుపుచేసే మొత్తాలకు ఆకర్షణీయమైన డివిడెండ్లు కూడా తోడవుతాయి.

మార్గదర్శిలోని హితులు మీ ఆశలకూ, ఆశయాలకూ ఒక ఆకృతి కల్పిస్తారు. మార్గదర్శిలో పొదుపు చేస్తే ధనానికి పూర్తి రక్షణ ఉంటుందని లక్షమందికి పైగా ఇప్పటికే గ్రహించారు.

మరి మీ మాటేమిటి ?

**డబ్బు కోసమేనా మీ చింత - మార్గదర్శి వున్నది మీ చెంత!**



**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేటు లిమిటెడ్
మార్గదర్శి హౌస్, అబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

శాఖలు: ● అబిడ్ సెంటర్, హైదరాబాద్ ● లక్డీకాపూల్, హైదరాబాద్ ● చిక్కడపల్లి, హైదరాబాద్ ● అమీర్‌పేట, హైదరాబాద్ ● చంద్రలోక్ కాంప్లెక్స్, సికిందరాబాద్ ● బిసెంట్ రోడ్, విజయవాడ ● బందరు రోడ్, విజయవాడ ● మెయిన్ రోడ్, గుంటూరు ● మెయిన్ రోడ్, కాకినాడ ● ఇన్నీసుపేట, రాజమండ్రి ● నెహ్రూ రోడ్, కర్నూలు ● మెయిన్ రోడ్, విశాఖపట్నం ● జె. పి. ఎన్. రోడ్, వరంగల్

KIRON/MCF/81/1



# నా ప్రపంచం వికసించింది
# ...దాన్ని పెంచి పోషిస్తోంది జై కిసాన్

జైకిసాన్ మీ పంటలను పెంచి పోషిస్తుంది, మీ కలల్ని నిజమని నిరూపిస్తుంది. అధునాతనమైన సాంకేతిక పరిజ్ఞానం ఆధారంగా గల జైకిసాన్ శక్తివంతమైన ఎరువులు భూమిలో వెంటనే కరిగి మీ పంటలకు అపారమైన శక్తినీ, తక్షణమైన పెరుగుదలనూ చేకూరుస్తాయి. మీ పైర్లతోపాటే మీ భాగ్యంకూడా వికసిస్తుంది ...మీకు హెచ్చు దిగుబడినీ, దాంతోపాటు హెచ్చు సంపదనూ ఇస్తుంది జైకిసాన్. గుర్తుంచుకోండి, ప్రతి పంటకు, ప్రతి భూమికి అవసరానికి తగిన పాళ్లలో వేయడానికి జైకిసాన్ ఎరువు ఉంది. జైకిసాన్ ఎరువుల విస్తృతమైన శ్రేణిలోంచి మీరు మీకు కావలసినదాన్ని ఎంచుకోవచ్చు.

**జై కిసాన్ యూరియా 46.4 % నత్రజని** అతి తెల్లటిది, అతి స్వచ్ఛమైనది, అతి శక్తివంతమైనది. దీనిలో బైయూరెట్ పాలు అతి తక్కువ (0 5% కంటే తక్కువ). అంచేత ఆకుల మీద పిచికారి చేయడానికి సురక్షితమైనది. అన్ని పంటలకూ భూమిమీద పై చల్లుగా అనువైన ఎరువు.

**జై కిసాన్ యూరంఫాస్ 28:28:0** అత్యధికంగా నత్రజనీ, ఫాస్ఫేటూ సమానమైన పాళ్లలో గల శక్తివంతమైన ఎరువు. దాదాపు పూర్తిగా నీటిలో కరుగుతుంది. దీనిలోని రెండు పోషక పదార్థాలూ కూడా ఒకే సమయంలో భూమిలో కరిగి పెరుగుతున్న పంటకు అందుబాటులో ఉంటాయి.

**జై కిసాన్ సంపూర్ణ 19:19:19** అతి చిక్కనైన కాంప్లెక్స్ ఎరువు. దీనిలో నత్రజని, ఫాస్ఫేటు, పొటాష్‌లు సమానమైన పాళ్లలో ఉన్నాయి. దాదాపు పూర్తిగా నీటిలో కరిగే ఈ ఎరువులో 57% పోషక పదార్థాలున్నాయి అవన్నీ ఒకే సమయంలో భూమిలో కరిగి పంట వాటిని సులభంగా గ్రహించడానికి వీలు పడుతుంది. పొటాష్ లోపం గల భూములకు జైకిసాన్ సంపూర్ణ ప్రత్యేకించి లాభదాయకమైనది.

జైకిసాన్ యూరంఫాస్, సంపూర్ణ ముఖ్యంగా అధిక దిగుబడి రకపు వరి, చెరకు, కాయగూరలు, పత్తి, జొన్న, గోధుమ మొదలైన పంటలకు బాగా అనువైనవి. అంతేకాదు, కాఫీ, తేయాకు లాంటి తోట పంటలకూ, మామిడి, కమలా, నారింజ, అరటి మొదలైన పండ్ల తోటలకూ కూడా ఎంతో అనువైనవి.

**జై కిసాన్ సౌభాగ్య 14:35:14** నత్రజని, పొటాష్‌లు దీనిలో సమానమైన (ఒక్కొక్కటి 14%) పాళ్లలో ఉన్నాయి. పైగా 35% ఫాస్ఫేటు కూడా ఉంది—అంటే మొత్తం 63% పోషక పదార్థాలు ఉన్నాయన్నమాట. ఫాస్ఫేటు హెచ్చుగా ఉండటం వల్ల జైకిసాన్ సౌభాగ్య ముఖ్యంగా వేరుశనగ, ఇతర నూనె గింజల పంటలకూ, పప్పు దినుసుల పంటలకూ బాగా అనువైనది. దుంపజాతి పంటలైన బంగాళాదుంప (ఆలుగడ్డ), పసుపు, కందమూలం, ఉల్లి మొదలైనవాటికి కూడా ఎంతో మంచిది. చెరకు, పత్తి పంటలకూ, ఏలకులు మొదలైన తోట పంటలకూ కూడా ఉపయోగకరమైనది.

**జై కిసాన్ డయంఫాస్ 18:46:0** డయంఫాస్ 18.46:0 లో 18% నత్రజని, 46% ఫాస్ఫేటు ఉన్నాయి. అత్యధికంగా పాళ్లు కలిగిన కాంప్లెక్స్ ఎరువు అయినందువల్ల తక్కువ పరిమాణంలో వేస్తే చాలు. అంచేత ఖర్చుకూడా చాలా తక్కువ. ఈ ఎరువు ప్రత్యేకించి, హెచ్చుగా ఫాస్ఫేట్ కావలసిన పంటలకు అంటే వేరుశనగ, పప్పు దినుసులు, నూనె గింజలు మొదలైన వాటికీ, పసుపులాంటి దుంపజాతి పంటలకూ అనువైనది. చెరకు, పత్తి పంటలకు కూడా మంచిది

## జై కిసాన్ ఎరువులు - అత్యంత శక్తికీ, సత్వర పెరుగుదలకూ




జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.
ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: కర్నూలు, సికింద్రాబాద్, బెంగుళూరు, హుబ్లి, కొంకణ్, నాగపూర్, పూనా.
మీ జైకిసాన్ ఎరువుల్ని జువారి వారి పసుపు పచ్చ దుకాణాల్లో కొనుక్కోండి








'నాయుడుగారి అబ్బాయి'లో
కృష్ణ, అంబిక

## బంగారుభూమిలో బరితెగించిన హరి

హరిబాబు (గిరిబాబు) దృష్టిలో కంటికి కనిపించే ఏ అమాయకురాలైనా ఆట వస్తువు.

ఆ రోజు అతనిగదిలో ఓ అమ్మాయి ఉండగా కాలింగ్ బెల్ మ్రోగింది. హరిబాబు విసుగ్గా వెళ్ళి తలుపుతీశాడు. ఎదురుగా సుశీల (సంగీత) కనిపించింది. విస్తుపోయాడు. "సుశీ, నువ్వా! ఏమిటివ్వాళ వచ్చావ్?"

"లోపలికి పదండి, చెబుతాను."

"అబ్బే" హరిబాబు తడబడ్డాడు. వెంటనే తమాయించుకొని, "నువ్వు రావటానికి వీల్లేదు. లోపల ఇన్‌కమ్‌టాక్స్ వాళ్ళ సర్చ్ జరుగుతూంది. సాయంకాలం రా. మాట్లాడుకుందాం!" బుకాయించాడు.

సుశీల నిట్టూర్చింది. "ఏం లేదు హరీ! వెళ్ళాక్కుగా నీకో విషయం చెప్పాలను కుంటున్నాను. కాని, నువ్వు ఎక్కడికెళ్ళావో కూడా తెలియక ఇన్నాళ్లూ బాధపడ్డాను."

"వ్యాపారం గురించి వెళ్ళానులే. ఇంతకూ, ఏమిటా విషయం?"

"అనాథనైన నన్ను ఆదరించి, తాళికట్టి, నీదాన్ని చేసుకున్నావు. ఆ విషయం కొన్నాళ్ళు రహస్యంగా ఉంచమన్నావు. అదొక్కటైతే కడుపులో దాచుకోగలిగానుగాని, పెరుగుతున్న బిడ్డను దాచగలనా?"

"ఆఁ!" హరిబాబు గతుక్కుమన్నాడు.

"అవును. ఈ సంగతి బయటపడితే, నేనుంటున్న హాస్టల్లోనే భర్తుండి, పతిత అనే అపనింద పడాల్సి వస్తుంది."

"ఛ ఛ అంతవరకు నీకు రానిస్తానా? రేపు నేను మీ హాస్టల్‌కు వచ్చి, విషయం చెప్పి, సగౌరవంగా నిన్ను తీసుకెళ్తాను. సిద్ధంగా ఉండు."

"మీ మీద నాకా నమ్మకం ఉందండి. వెళ్ళొస్తాను," అంటూ సుశీల నిష్క్రమించింది.

హరి గబగబా బట్టలు సర్దుకోసాగాడు. గదిలో ఉన్న అమ్మాయి "ఏమిటి హరీ, ఈ హడావిడి?" అంది.

"హడావిడికాదు. అర్జంటుగా మానాన్నగారికి సీరియస్‌గా ఉందని టెలిగ్రామ్ వచ్చింది. వెంటనే బయలుదేరాలి," అన్నాడు.

ఆ అమ్మాయి కూడా అతని మాయమాటలు నమ్మింది.

పి. చంద్రశేఖరరెడ్డి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. పి. వెంకన్నబాబు నిర్మించే మహేశ్వరీ మూవీస్ "బంగారుభూమి"లో కృష్ణ, శ్రీదేవి నాయికా నాయకులు.

## సినిమా

—వి.వి.జి

## మరాఠా గండుల్లో మారిబాబు వాగ్ధాటి

నాలుగు రోడ్ల కూడలి మారిబాబు (సూతప్ ప్రసాద్) స్టూల్‌మీద నిలుచొని, "అంతా ఒకసారి చప్పట్లు కొట్టండి, బాబూ!" అన్నాడు. చుట్టూ మూగిన జనం అలాగే చేశారు. దాంతో మారిబాబుకు ఉత్సాహం ముంచుకొచ్చింది. పెట్టెలోంచి ఓ సీసా తీశాడు. "నా చేతిలో ఉన్న ఈ తైలం పేరు రోమా తైలం, బాబూ! బట్టతలమీద వెంట్రుకలు మొలిపించడం ఆ బ్రహ్మదేవుడికే తరం కాక చేతులెత్తేసిన సమయంలో మా గురువుగారు శ్రీ వెంకటేశ్వరరావుగారు దండకారణ్యంలో ఎండి పోయిన వేపచెట్టు కింద ఏడు సంవత్సరాలు తపస్సు చేసి, ఈ తైలాన్ని తయారుచేశారు, బాబూ! నేను మంచివాడ్ని, ఉత్తముడ్ని, జెంటిల్మెన్ని కాబట్టి మా గురువుగారు ఈ తైలాన్ని నాకు ఒప్పజెప్పేసి, వారు స్వర్గానికి వెళ్లిపోయారు. మొన్ననే వారి తద్దినం కూడా పెట్టేశాను. సోదరులారా! ఈ తైలాన్ని బోర్లించిన కుండమీద రాసి చూడండి. గంట తిరిగేసరికి ఆ కుండంతా జుత్తే! కోడిగుడ్డుమీద రాసి చూడండి — అరగంట తిరిగేసరికి కోడిగుడ్డంతా రోమాలే. అదే బట్టతలమీద రాస్తే, బుర్రెడు జుత్తు వస్తుంది. కావాలంటే, జడలుకూడా వేసుకోవచ్చు. త్వరపడాలి, బాబూ! ఆలసించిన ఆశాభంగం. నా దగ్గర ఎక్కువ స్టాకు లేదు. మొన్ననే హిందీ యాక్టరు అమితాబచ్చన్ గారు వచ్చి, అరడజను సీసాలు పట్టుకెళ్లిపోయారు. తెలుగు హీరోయిన్లు చాలామంది ఈ తైలాన్నే వాడుతున్నారు. హహా ఆడా మగే కాదు బాబూ! వీళ్ళిద్దరికి మధ్యనున్న మరో కేటగిరి మనుషులు కూడా రాసుకోవచ్చు. ఎవరు రాసుకున్నా—పక్షపాతం లేకుండా రోమాలు పెరుగుతాయ్. లైన్లో నిలబడి క్యూలో రండి."

అతని మాటలు నమ్మి, చాలామంది సీసాలు కొనుక్కున్నారు. వాడినవారందరికీ ఉన్న జుత్తు కూడా ఊడిపోతుందట. దాంతో గొడవ.

కట్టా సుబ్బారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎ. సోమరాజు నిర్మించే వరిగను ప్రొడక్షన్స్ "మరాఠా గంగులు" చిత్రం షూటింగ్ పూర్తయింది. శోభన్‌బాబు, శ్రీదేవి, శరత్‌బాబు, నళిని, అల్లు రామలింగయ్య, స్మిత, నిర్మల ఇతర పాత్రధారులు. కాశీ విశ్వనాథ్, సత్యం, వేటూరి, కొసరాజు, సినవాడ్, శివరావు, కాకుమాని నాగేశ్వరరావు, కె. రంగారావు, కొల్లి బాసిరెడ్డి, అక్కల రాజ్‌ప్రసాద్, వి. నిరంజన్‌రెడ్డి తెరవెనుక కృషి చేశారు.

## నాయుడుగారబ్బాయి

"[illegible] జరిగే షెడ్యూల్‌తో చిత్రం దాదాపు పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ టి.వి. ప్రసాద్. దాసరి కథ, స్క్రీన్‌ప్లే, సమకూర్చిన రాజీవి పరివర్షినారి ఈ చిత్రంలో కృష్ణ, అంబిక, రంగనాథ్, కవిత, రావు గోపాలరావు, కాంతారావు, నాగేష్, సుకుమారి నటిస్తున్నారు. చక్రవర్తి సంగీతం, లక్ష్మణ్ గోరే ఛాయా. ఎస్. రామలింగేశ్వరరావు, టి.వి.కె.వి. గోపినాథ్ నిర్మాతలు.

## దాసరి రచన, పర్యవేక్షణలో దిడ్డి శ్రీహరిరావు చిత్రం

దాదాపు మూడేళ్ళ తర్వాత దిడ్డి శ్రీహరిరావు కొత్త చిత్రానికి సన్నాహాలు చేస్తున్నారు. "దాసరి నారాయణరావుగారు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు సమకూర్చి దర్శక పర్యవేక్షణ జరుపుతారు," అన్నారాయన.

'మరాఠా రంగులు'లో



# సినిమా

## విజయచంద్ర మరోసారి ఏసుక్రీస్తుగా

"ఆదికాండం నుంచి స్వర్గారోహణ వరకు ఏసుక్రీస్తు జీవితాన్ని సినిమా స్కోప్‌లో తీస్తున్నాం," అన్నారు నిర్మాత ఎ. జి. రావు. విజయచంద్ర ప్రధాన పాత్రధారి. రాజనాల, రవికాంత్, కృష్ణమోహన్, పాండురంగారావు, శ్యామ్‌బాబు, శివకుమార్, శశిమోహన్, చంద్రకళ, శ్రీకళ, లక్ష్మీప్రియ, సుధారాణి, శ్రీశాంతి వగైరా






'అద్దాల మేడ'లో అంబిక

నటవర్గం జీరా ఆనందరావు సేకరించిన కథకు జి విజయరత్నం, మోహన్ మాటలు, పాటలు సమకూరుస్తున్నారు. ఎస్ ఆర్ కె మూర్తి ఛాయ, దేవేంద్రనాథ్ కూర్పు, వీరాంజనేయులు నిర్వహణ, గోనా విజయరత్నం పర్యవేక్షణలో ఈ స్పార్క్ ఇంటర్నేషనల్‌వారి ''అంతిమ యాత్ర'' తొలి షెడ్యూల్ జూన్ 24 నుంచి జూలై మొదటి వారం వరకు నరసరావుపేటలో జరుగుతుందని స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే గుడ్లూరి గోపీకృష్ణ తెలియజేశారు



ఘంటసాల విజయకుమార్

## తండ్రి అడుగు జాడల్లో తనయుడు ఘంటసాల విజయకుమార్

'పాట అంటే ఇలా ఉండాలి' అని నేపథ్య గానానికి ఒక విశిష్టతను కల్పించి, పది వేలకు పైగా రసానుభూతితో పాటలు పాడి, వంద చిత్రాలకు పైగా సంగీతం సృష్టించిన స్వర్గీయ ఘంటసాల వెంకటేశ్వరరావు లాంటి కంఠ స్వరం ప్రకృతిలో అరుదుగా, అపురూపంగా వ్యక్తమయ్యే అద్భుతాలలో ఒకటి అసలు లలిత సంగీత కచేరీలు ఆయనతోనే ప్రారంభమయ్యాయి ఆయన ప్రత్యేక బాణీతో ట్యూన్ చేసిన పన్నెండు అన్నమాచార్య కీర్తనలను ఆయన జ్యేష్ఠ పుత్రుడు ఘంటసాల విజయకుమార్ భక్తి పారవశ్యంతో గానం చేయగా ప్రముఖ ఎ వి ఎం ప్రొడక్షన్ సర్వీస్ వారు రికార్డ్ చేసి, తెలుగునాట తొలిసారిగా కేసెట్‌గా విడుదల చేస్తున్నారు ఈ సందర్భంగా జూన్ 13వ హోటల్ పామ్‌గ్రోవ్‌లో పాత్రికేయుల సమావేశం జరిగింది "అచ్చం ఆయన తండ్రిగారి కంఠం వింటున్నట్టే ఏదో అనిర్వచనీయమైన ఆనందం కలిగింది విజయకుమార్ క్రమక్రమంగా తండ్రి అంతటి మహా గాయకుడు కాగలడు," అంటూ ఆ కీర్తనలను విన్న ప్రముఖులు శ్రీయుతులు డి ఆంజనేయులు, వి ఎ కె రంగారావు, కోట సత్యరంగయ్యశాస్త్రి ప్రశంసిస్తూ, విజయకుమార్‌కు ఈ మహదవకాశాన్ని కలిగించి, ఆయన తండ్రిని గౌరవించిన ఎ వి ఎం శరవణన్‌ను అభినందించారు

సంగీత కళాశాలలో గాత్ర సంగీతంలో "విద్వాన్", లండన్ ట్రినిటీ కాలేజ్ ఆఫ్ వెస్టర్న్ మ్యూజిక్‌లో పోస్ట్‌గ్రాడ్యుయేట్ పట్టా పొందిన విజయకుమార్ ఎన్నో కచ్చేరీలు ఇచ్చారు "వస్తాడే మా బావ" చిత్రానికి తండ్రిగారితో కలిసి సంగీత దర్శకత్వం వహించారు "పగడాల పడవ" తర్వాత "బంగారు బాట, మరో జన్మ, హరివిల్లు, మంచుతెర, భీమ ప్రతిజ్ఞ" చిత్రాలకు సంగీతమిస్తున్నారు

## కె రాఘవేంద్రరావు దర్శకత్వంలో రగిలే జ్వాల

"మా చిత్రానికి 'రగిలే జ్వాల' అని పేరు పెట్టాం," అన్నారు విజయలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత టి త్రివిక్రమరావు ద్విపాత్రలు ధరించే కృష్ణంరాజు సరసన జయప్రద, సుజాత నాయికలు జగ్గయ్య, రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, గిరిబాబు తక్కిన నటవర్గం సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, కె ఎస్ ప్రకాష్, భాస్కరరాజు, కె వెంకటేశ్వరరావు ప్రభృత సాంకేతికవర్గంతో టి ప్రద్యుమ్నరావు నిర్వహణ బాధ్యతలు చూస్తున్నారు "ఊటీలో రెండు పాటలు చిత్రీకరించాం," అన్నారు డైరెక్టర్ కె రాఘవేంద్రరావు

## ప్రేమ నక్షత్రం

"ఫస్ట్ షెడ్యూల్ జూలై 8నుంచి 15 వరకు ఉంటుంది," అన్నారు హేమా ఇంటర్నేషనల్‌వారి పై చిత్రాన్ని సమర్పించే ఎస్ హెచ్ హుసేన్ ఈయన లోగడ తయారైన "అపాధ్యుడు, అఖండుడు, సర్వర్ సుందరం" చిత్రాల్లో భాగస్వామి డాక్టర్ కొమ్మూరి వేణుగోపాలరావు కథకు, సంభాషణలకర్త ఎం ఎస్ విశ్వనాథన్ స్వర కల్పనలో వేటూరి గీతాలు రాశారు తొలిగీతం జూన్ 17న రికార్డయింది కృష్ణ, శ్రీదేవి, మధాకర్, సులక్షణ, మంజుల, రావు గోపాలరావు, ప్రసాద్ బాబు ప్రభృతులు పాల్గొంటారు వి ఎస్ ఆర్ స్వామి, కె రామలింగేశ్వరరావు, వెంకటరత్నం, శరత్‌బాబు, గోపాల్, తాండవకృష్ణ, ప్రసాద్ సాంకేతికవర్గంతో కె బుచ్చిరెడ్డి, ఎం జనార్ధనరెడ్డి, పి సురేంద్రరెడ్డి ఎన్ రాధారెడ్డి నిర్మాతలు



'మీనం కోసం'లో రజనీకాంత్



'బంగారు భూమి'లో ఒకదృశ్యం

## తారలు-తీరులు

★ సుమలత "భువన" అనే మలయాళ చిత్రంలో నటిస్తోంది. తిరువనంతపురంలో ఆఖరి రోజు షూటింగ్ ముగించుకొని, ఆ సాయంత్రమే మద్రాసుకు బయలుదేరాలి. షూటింగ్ పూర్తయ్యేసరికి కాస్త ఆలస్యమైంది. హడావిడిగా మేకప్ తీసేసి, ఏకాయెకీన విమానాశ్రయానికి బయలుదేరింది. గగనసఖి (ఎయిర్‌హోస్టెస్) "మీకు వివాహమైందా?" అని అడిగింది. విమానంలో కూడా ఒకరిద్దరు "మీకు పెళ్ళయ్యిందా?" అని అడిగేసరికి సుమలత నిర్ఘాంతపోయింది. "ఆ తర్వాతగాని నాకు తెలిసింది కాదు వాళ్ళెందుకు అలా అడిగారో. ఆ రోజు షూటింగ్‌లో పెళ్ళి సీను. షూటింగ్ పూర్తయ్యాక మేకప్ తీసేసి, కాస్ట్యూమ్స్ మార్చుకున్నానేగాని, ఆ హడావిడిలో మెడలో హీరో కట్టిన తాళిబొట్టు అలాగే ఉండడం సంగతి మరచి ఏకాయెకీన విమానాశ్రయానికి చేరుకున్నానన్నమాట. ఇంకా నయం మద్రాసు దాకా ఆ తాళిబొట్టుతో వచ్చాను కాదు," అందామె నవ్వుతూ.

★ మంజుభార్గవి నటించే ఒక తమిళ చిత్రంలో ఆమె సరసన రవీందర్ అనే కొత్త నటుడు హీరో. మంజుభార్గవి పొడవు 5 అ 7½ అంగుళాలు. ఆమెకన్నా రవీందర్ కాస్త పొట్టి. "పాటల చిత్రీకరణప్పుడు నే పడ్డ అవస్థ ఇంతా అంతా కాదు. కొన్ని సన్నివేశాలలో నా పక్కన రవీందర్‌ను స్టూల్‌మీద నిలుచోబెట్టారు," అని నవ్వుతూ మంజుభార్గవి "ఇంకో ఇన్సిడెంట్ కోడైకెనాల్‌లో 'పొన్నిలంగు' అనే మరో తమిళ చిత్రం షూటింగ్ ఒక కొండ శిఖరంమీద చిత్రీకరణ. కారులో హీరో విజయ్‌బాబు, నేను కూర్చొని ఉన్నాం. డ్రయివరు కారు దిగిపోయాడు. డైరెక్టరు 'స్టార్ట్' చెప్పేలోగానే కారు ఉన్నట్టుండి వెనక వైపుగా పల్లంకేసి జారిపోసాగింది. నాకు చచ్చేంత గాభరా వేసింది. విజయ్‌బాబు కేకలెట్టసాగారు. సమయానికి డైరెక్టరు, కారు డ్రయివరు, యూనిట్‌లోని మరికొందరు పరుగున వచ్చి కారును ఆపడంవల్ల గండం తప్పిందిగాని, దాన్ని ఆపకపోతే కొంత దూరంలో ఉన్న లోయలో పడి ఉండేది," అందామె.

★ మామిడిపళ్ళంటే అందరికీ ఇష్టమే. మాధవికి మాత్రం కాస్త భయం. ఎందుకో తెలుసా? ఏలూరు దగ్గర వాళ్ళకో పెద్ద మామిడితోపు ఉంది. [illegible] సీజన్‌లో ఆమె అక్కడికి వెళ్ళింది. వాళ్ల మేనేజర్ వెంకట్రామయ్య "మొదటి మామిడికాయను మీరే కోయాలి," అన్నాడు. ఆమె లాగేసరికి ఒకటికి బదులు రెండు మామిడికాయలు చేతికొచ్చాయి. వాటి జీడి ఆమె చేతిమీద కాస్త పడి, చురుమందట. ఇంతలో ఓ కుర్రాడు అక్కడికి వచ్చాడు. ఆ అబ్బాయి ముఖం నల్లటి మచ్చలతో వికారంగా ఉంది. మామిడి జీడివల్ల అలా అయిందని మాధవికి తెలిసిందట. అప్పట్నుంచీ మాధవికి మామిడిపళ్ళన్నా, కాయలన్నా ముట్టుకోటానికి కాస్త తటపటాయిస్తూంటుందట.



'జేగంటలు'లో ఒక సన్నివేశం





'శ్రీ శివకుమార సంభవం'లో బేబీ రోహిణి

## జేగంటలులో శుభ ఘడియలు

రాజా (రాంజీ) వంక రావులమ్మ (రమాప్రభ) చురచురా చూసింది "కోడలికి బుద్ధి చెప్పి, అత్తేదో చేసిందట అట్టా ఉంది వ్యవహారం నువ్వు చేసేది మాత్రం ఏంటి? పెళ్ళికాని పిల్లను వెంటేసుకుని ఊరంతా తిరుగుతున్నావే! విన్నవరు కొట్టాలి? అది నలుగురి నోళ్ళల్లోపడి అల్లరి పాలవ్వాలనా — లేకపోతే, దాని బతుకు నట్టేట్లో ముంచెయ్యాలనా? ఏమిటి నీ ఉద్దేశం? చెప్పు!"

రాజా చిరునవ్వుతో "చెప్తాను సీత ఏమైపోతుందోననేగా నీ భయం? ఇప్పుడు నా మనసు తెలిసిన మనిషైంది రేపు నా బ్రతుకు నడిపించే భార్యవుతుంది,' అన్నాడు

రావులు ముఖం విప్పారింది "బాబూ, అదే నిజమైతే, నాకంటే సంతోషించే వాళ్ళుండరు మీ పెళ్ళికి ఆకాశమంత పందిరేసి" అని రావులు అనేలోగా "నీ మనసంత పీట వేస్తే చాలు," అని రాజా అందుకున్నాడు

అప్పుడక్కడికి వచ్చిన సీత (ముచ్చెర్ల అరుణ)తోపాటు అందరూ నవ్వుకున్నారు

మాగంటి రవీంద్రనాథ్ చౌదరి, కె నరసింహం నాయుడు సమర్పించే జ్యోతి చిత్ర వారి 'జేగంటలు" చిత్రాన్ని ఎస్ శ్రీనివాసరావు దర్శకత్వంలో కె మురారి, విజయబాపినీడు నిర్మించారు

## రష్యా అంతర్జాతీయ చలన చిత్రోత్సవానికి వాడని మల్లి

మురికివాడలలో నివసించే కష్టజీవుల స్థితిగతులను యధాతథంగా చిత్రీకరించిన ఎ వి ఎం మురుగన్‌వారి "వాడని మల్లి" చిత్రం జూలై మొదటి వారంలో రష్యాలో జరిగే అంతర్జాతీయ చలన చిత్రోత్సవంలో ప్రదర్శనకు ఎన్నికైంది ఆ చిత్రంలోంచి ఒక సన్నివేశం

మిలిటరీ నుంచి తిరిగొచ్చిన ఆసిరయ్య ఓ టీ కొట్టు దగ్గిర ఆదెమ్మను చూశాడు ముగ్ధుడయ్యాడు తనకు పెళ్ళంటూ జరిగితే ఆదెమ్మతోనే అనే నిర్ణయానికి వచ్చాడు ఏకాయెకీన వచ్చి ఆ విషయాన్ని తన తండ్రి కానిస్టేబుల్ ముత్యాలుకు చెప్పాడు

"యేటేటి? ఆదెమ్మ — అప్పన్న కూతురు కదూ? దాన్నట్రా సేసుకునేది? నీ పొదరు పొజిషనేటి? దాని పొదరు పొజిషనేటి? నన్ను మూడుపార్లు సస్పెండు సేసినా — వుద్యోగం పోలేదు అంత గొప్పోడికి ఆదెమ్మట్రా కోడలు?" ముత్యాలు మండిపడ్డాడు

"పాదర్! ఐక్ గోయింగు టయన్ గోయింగు సేసుకుంటే ఆదెమ్మనే సేసుకుంటా లేపోతే ఇట్టాగే కన్యగా వుండిపోతా అంతే యువ్ నా పాదర్ నో ఐ నో సన్," అని తేల్చేశాడు ఆసిరయ్య

"ఒరేయ్ నా కొడకా, పెళ్ళంటే ట్రాఫిక్ కంట్రోలంత కష్టంరా నాయనా!"

"నీ మాటంటే తూటా లేని తుపాకిలా బతకాలి"

"లాఠీచార్జి సేస్తన్నావు కదరా? సరే దాన్నే ఇచ్చి సేస్తాలేరా!"

ఆసిరయ్య ఆనందంతో అటెన్షన్‌లో నిలుచుండిపోయాడు

హరనాథరెడ్డి నవల "చీకటోళ్ళు" ఆధారంగా విమలాదేవి స్క్రీన్‌ప్లే రాసి నిర్మించే "వాడని మల్లి"లో ఎ వి ఎం సుప్రియ, కళారాణి, శ్రీలక్ష్మి, చాదరిబాబు, నందకుమార్, టెలిఫోన్ సత్యనారాయణ, రాఘవయ్య, విశ్వేశ్వరరావు, దినకర్, శ్రీహరి, విజయకుమార్ పాల్గొన్నారు వేటూరి సాహితి గీతాలకు సత్యం సంగీతమిచ్చారు టి ఎస్ రామారావు సహకార దర్శకుడు ఎ వి ఎం మురుగన్ దర్శక నిర్మాత

## విశ్వరూపంలో విశ్వాసఘాతకులు



అయోమయంలో [illegible] న్నాడు అన్నారావు (రావు గోపాలరావు) కోడి మెడ కోసినట్లు బీర్ బాటిల్ ఓపెన్ చేశాడు గున్నారావు (సత్యనారాయణ) ఆ బాటిల్ వంక గుంటనక్కలా చూస్తున్న రామలింగం (అల్లు) "అక్కడ నీరు పొంగింది ఇక్కడ బీరు పొంగింది లోపల అయ్యగారి రక్తం పొంగింది", అన్నాడు

గున్నారావు సిప్ చేస్తూ "ఏమైనా సరే, వాడ్ని అలా విడిచిపెడితే లాభం లేదు ఇప్పుడు ఇంతవరకు వచ్చాడంటే—రేపు ఇదే జనంతో మనల్ని ఊరి నుండి తరిమేసినా ఆశ్చర్యపడనక్కర్లా వాడి ప్రాణాలు తీసేవరకు నిద్ర పోను", అంటూ విశ్వం (ఎన్ టి ఆర్) ప్రాణాల్ని ఒక్కసారిగా మింగేసినట్టు గుటక వేశాడు

"మా బాగా చెప్పారు వాడిమీద నాకు మొదట్నుంచీ ఉంది కసి నాకు రావాల్సిన లీడర్‌షిప్పు వాడికెప్పుడైతే వచ్చిందో—ఇక వేటు వేసేద్దామని బయలుదేరాను దారిలో ఓ ఫ్రెండ్ కనబడి ఓ బీరుకాయిచ్చాడు అది తాగేక అనిపించింది— వాడ్ని చంపితే మాత్రం లీడర్‌షిప్ నాకొస్తుందా అని అందేత వైద్యానికి బీరకాయ ఎంత మంచిదో, ఆలోచనకు బీరుకాయ అంత మంచిదని" అంటూ రామలింగం నాలుక తటపటలాడించి, "అక్క చెప్పండి అసమర్థుడైన మంచాడికంటే, సమర్థుడైన చెడ్డవాడే బెటరు మీరు సమర్థులు కొట్టుకోవడాలు, చంపుకోవడాలు ఏం పెట్టుకోవద్దు మీ పదవులేం కావు కాకపోతే ఎలెక్షన్ ప్రచారాలు కాస్త ముమ్మరంగా చేయించండి" అంటూ వత్తాసు పలికాడు

దాసరి నారాయణరావు కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వంలో కె భాస్కరప్రసాద్ నిర్మించే కవిరత్నా మూవీస్ "విశ్వరూపం" చిత్రం కొసరాజు సమరణ




# టాన్‌టెక్స్®

## యే విధంగా చూచినా ఉత్తమమైనది

శ్రేష్ఠతలో-వస్తువులో-తయారులో;
గాలి చొరని మన్నికగల ప్యాకింగులో,
మరియు సరసమైనది కూడా....

IS : 4964



మీకు ఖచ్చితంగా
సరిపోతుంది
టాన్‌టెక్స్

టాన్‌టెక్స్ విస్తృత శ్రేణి:
బ్రీఫ్‌లు • వెస్ట్‌లు
క్యాజువల్స్ • స్పోర్ట్స్
• పిల్లల దుస్తులు



టాన్‌టెక్స్
ttk తయారీ

టి.టి. కృష్ణమాచారి అండ్ కో.
మదరాసు 600 086.

Imageads M-TTK-1361 Tel



'రగిలే జ్వాల' లో కృష్ణంరాజు, జయప్రద

## రుద్రతాండవంలో కోటేశ్వరరావు కుతూహలం

కోటేశ్వరరావు (నూతన్‌ప్రసాద్) టాక్సీలో వెళ్తున్నాడు వెనుక సీటులో తన పక్కనే పడి ఉన్న పూలు, గాజుముక్కలమీద పడిందతని దృష్టి "ఓరి నీ ఇంటి కోడి మా ఇంట గుడ్డు పెట్టా ఏమో అనుకున్నాను గ్రంధసాంగుడివే," అన్నాడు డ్రయివర్‌కు ఏమీ అర్థం కాలేదు "ఇదుగో ఏమీ ఎరగనట్టు నటించకు నాకు నీ సంగతంతా అర్థమైపోయింది ఈ పగిలిన గాజులూ, నలిగిన పువ్వులూ" కోటేశ్వరరావు ఆత్రుత అర్థం చేసుకున్న డ్రైవరు "అలాంటి విషయాలు మీలాంటి పెద్దమనుషులు అడక్కూడదు నేను చెప్పకూడదు," అన్నాడు బెట్టుసరిగా

"అమ్మమ్మమ్మ ఇలాంటి విషయాల్లో పెద్ద చిన్న భేదం లేదోయ్"

"అదంతా చెప్పాలంటే నా చెయ్యి కాస్త తడపాలి ఓ రెండు పారెయ్యండి"

చచ్చినట్టు రెండు రూపాయలిస్తూ, "నీ ఇంటి కోడి మా ఇంట చావా ఇప్పుడు చెప్పవయ్యా," అన్నాడు కోటేశ్వరరావు

"వినండి పిటపిటలాడుతున్న ఓ పద్దెనిమిదేళ్ళమ్మాయి, రెపరెపలాడుతున్న ఇరవై ఏళ్ళ అబ్బాయీ వచ్చారండి."

"బహుశా లేచొచ్చిన బాపతై ఉంటుంది ఊఁ తర్వాత ?"

"పరాయివాళ్ళ రహస్యాలు చెప్పకూడదండీ మహా పాపం! మరో రెండు పడేయండి దానితో ఆ పాపం కడిగేసుకుని చెప్పేస్తాను"

ఒక వంక మీటర్ చార్జీతోపాటు డ్రైవర్ లంచం పెరిగిపోతోంది పీటితో పాటేపడి కోటేశ్వరరావు కుతూహలం పెచ్చుమీరినా అసలు విషయాన్ని డ్రయివర్ ఎందుకు చెప్తాడు ?

విజయబాపినీడు నేతృత్వంలో మాగంటి రవీంద్రనాధచౌదరి నిర్మించిన శ్రీ శ్యాంప్రసాద్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ "రుద్రతాండవం"లో మురళీమోహన్, శరత్‌బాబు, ఈశ్వరరావు, రాళ్ళపల్లి, చిట్టిబాబు, సునీత, జ్యోతిలక్ష్మి, అంజలీనాయుడు, జయవిజయ పాత్రధారులు రాజ్‌భరత్ దర్శకుడు వేటూరి రచయిత శంకర్‌గణేశ్, శ్యాం సంగీత దర్శకులు తివారీ ఛాయాగ్రాహకుడు

## ఎ. ఎన్. ఆర్. 200వ చిత్రం దాసరి మేఘ సందేశం

"జూలై 1 నుండి 31 వరకు బుట్టాయగూడెంలో జరిగే షూటింగ్‌తో పూర్తవుతుంది," అన్నారు దాసరి నారాయణరావు ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వం వహిస్తూ నిర్మించే తారకప్రభు ఫిలిమ్స్ "మేఘ సందేశం" చిత్రానికి జూన్ 19న తొలి గీతం రికార్డయింది ఎ ఎన్ ఆర్ సరసన జయసుధ, జయప్రద నాయికలు రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు

## బృందావనం

"జూలైలో సాంగ్స్ రికార్డు చేసి, ఆగస్ట్‌లో షూటింగ్ ప్రారంభిస్తాం," అన్నారు నిర్మాత సి హెచ్ వెంకటేశ్వర్లు 'సిరిసిరి మువ్వ' తర్వాత చంద్రమోహన్, జయప్రద కలిసి నటించే విజయ హనుమాన్ పిక్చర్స్‌వారి "బృందావనం" చిత్రాన్ని ఎం పి అంజనేయులు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చెన్నుపాటి చెందూర్ సమర్పిస్తారు అల్లు రామలింగయ్య, రాళ్ళపల్లి, సూర్యకాంతం తక్కిన నటవర్గం భరత్ సంభాషణలు, ఎస్ రాజేశ్వరరావు సంగీతం, కె ఎస్. ప్రసాద్ ఛాయ నిర్వహిస్తారు ★

# దేవుడు కాస్తూనే వున్నాడు

## భాగవతుల సుబ్రహ్మణ్యం

నాగావళీ తీరం. తీరాన్ని ఆనుకొని ఏపుగా, పొడుగ్గా పెరిగిన కొబ్బరి తోటలు. వాటివానుకొని సాగిపోతున్న మామిడి తోటలు.

మరోవైపు సరుగుడు చెట్లు 'జాంవ్'

మంటూ వింత శబ్దాల్ని చేస్తున్నాయ్ ఇంకా తూర్పు తెల్లవారలేదు

ధనుర్మాసం చలి దంచేస్తోంది. దట్టంగా పొగమంచు కమ్ముకొంది.

నాగావళి నది నిశ్శబ్దంగా పారుతోంది. తోటపల్లి బ్రిడ్జిదగ్గర నది వంపు తిరిగినచోట ఓ పూరి పాకలోంచి నిండా దుప్పటి కప్పుకొన్న ఆకారం ఒకటి బయటకువచ్చి నిలబడి బీడీ వెలిగించు కుంది. వెలుగురేఖలు విచ్చుకోడానికి ఇంకా చాలా టైం పడుతుంది కాబట్టి ఆ ఆకారం ఎవరిదో పోల్చుకోవడం కొంచెం కష్టమే! కాని ఆ రూటులో తిరిగేవాళ్లకు ఆ ఆకారం సుపరిచితమే! బీడీ కాలుస్తున్న ఆ శాల్తీ పేరు కాసులు

గుమ్మలక్ష్మీపురం నుంచి పార్వతీపురంవైపు రివ్వున రెండు మూడు లారీలు దూసుకుపోయాయ్ నీటిమీద నుంచి వస్తున్న తేమగాలితో కలిసి చలి మరి కొంచెం ఎక్కువైనట్టనిపించింది కాసులుకు. పార్వతీపురం రోడ్డువైపు దృష్టి సారించి చూడ పొగాడు.

బీడీ కొన వ్రేలును చురుక్కుమనిపించగానే 'ధూ! దీనెవ్వ' అని, దాన్ని గిరాటేసి, "ఒక్కనా కొడుకూ ఆగడేటి ?" అని తిట్టుకొని, టీ కొట్లోకి వెళ్లి బెంచీ బల్లమీద చతికిలబడ్డాడు

తోటపల్లి బ్రిడ్జీ మూడు కేంద్రాలకు కూడలి పార్వతీపురం, వీరఘట్టం, గుమ్మలక్ష్మీపురం రహదారులు మూడు కలుసుకొనేది అక్కడే! ఒక వైపు నాగావళీ నది, మరోవైపు రిజర్వాయర్ రిజర్వాయరు నుంచి వెడల్పుగా సాగిపోయే ఒక పెద్ద కాలువ త్రవ్వడంచేత బ్రిడ్జిని కాస్త ఎత్తుగా కట్టారు.

బ్రిడ్జీ వంపు తిరిగేచోట, కాలువకూ – నదికీ మధ్యస్థంగా వున్న జాగాలో కాసులు ఓ చిన్న టీ బడ్డీ పెట్టుకున్నాడు వచ్చేపోయే లారీలూ, ట్రక్కులూ, అప్పుడప్పుడు బస్సులూ అక్కడ ఆపి డ్రైవర్లూ, క్లీనర్లూ టీ త్రాగి పోతూంటారు.

కాసులు టీ చెయ్యడంలో సిద్ధహస్తుడు అసలు రుచి టీలోనే వుందో, లేక కాసులు చేతిలోనే వుందో తెలీదు కాని, త్రాగితే కాసులు టీ కొట్లోనే టీ త్రాగాలి–అనిఒక్కసారి అక్కడ త్రాగినవాళ్లెవరైనా సరే ఒప్పుకొని తీరాల్సిందే! 'కాసులు బ్రాండ్‌టీ' అని ఆ చుట్టుప్రక్కల రెండుమూడు సెంటర్లవరకూ చెప్పుకుంటారు. ఏ ఎగ్జిబిషన్‌లోనైనా కాసులు టీస్టాల్ పెడితే ఫస్ట్‌ప్రయిజ్ కొట్టడం ఖాయం

అంతగిరాకీ, అంతపేరు ప్రఖ్యాతులూ వున్న కాసులు టీ బడ్డీలో టీ ఎలా వుంటుందో నాకూ రుచి చూడాలన్పించి నేనూ ఓసారి వెళ్లాను మీరు నమ్మకపోవచ్చు! కాని నిజం. నేను తోటపల్లి వెళ్లింది కేవలం కాసులు టీ కొట్లో టీ త్రాగడం కోసమే !

అక్కడ టీ త్రాగి వెళ్లినవాళ్లెవరైనాసరే, అసంతృప్తిగా వెళ్లరు ఆ విషయం నేను ఋజువు చేసుకున్న తర్వాతనే మీకుచెప్తున్నాను. మీరెప్పుడైనా తోటపల్లివస్తే కాసులు టీ కొట్లో టీ త్రాగటం మర్చిపోకండి !

అడ్వర్టైజ్‌మెంట్ అని కాదుగాని, నిజంగా కాసులు టీ వెల సరసం ఫల మధికం. టీ ఖరీదు చాలా తక్కువ. కప్పు కేవలం ఇరవై పైసలు రోజురోజుకీ మండిపోతున్న ధరల్తో పోల్చిచూస్తే కాసులుటీ 'చాల చౌక' అని చెప్పాల్సిందే !

సాధారణంగా టీ కొట్టు ఎల్లవేళలా తెరిచే వుంటుంది పీక్‌అవర్స్ అంటూ ఏమీలేకపోయినా, ఎప్పుడూ రద్దీగానే వుంటుంది రోజూ ఆ రహదార్ల వెంట పయనించే వాహనాల్లో మూడొంతులు అక్కడ ఆగందే ముందుకువెళ్లవు.

టీబడ్డీ అంటే కనీసం రేకులషెడ్ కూడా కాదు. కేవలం ఒక చిన్న తాటాకుపాక పాక బయటకు ఏటవాలుగా వుండి చిన్నదిగా కన్పించినా, కాస్త వొళ్లువంచి, లోపలికి దూరిచూస్తే పెద్దదిగానే కన్పిస్తుంది. అందులో ఓ మూల ఎత్తుగా కట్టిన నాడిపొయ్యి. దానికి ఎదురువైపు గోడలను కలుపుతూ పొగచూరిన దండెంకర్ర దానిమీద ఎప్పుడూ ఓ ఎర్రరంచు గావంచా వుంటుంది కాసులు ఎప్పుడో ముచ్చటపడి కుట్టించుకున్న ముతకఖద్దరు చొక్కా అప్పుడప్పుడు దానిమీద దర్శన మివ్వవచ్చు ఎప్పుడో ముచ్చటపడి -- అని ఎందుకనాల్సి వచ్చిందంటే, సాధారణంగా కాసులు వంటిమీద చొక్కా వుండదు కాబట్టి.

పాకలోకి గాలీ– వెల్తురూ బాగా రావడానికి మూడువైపుల మాత్రమే గోడలున్నాయి చాలా ఏళ్లే అయివుంటుంది – ఆ గోడలకు వెల్లవేసి. మసిబారిన ఆగోడలకు సినీతారల ఫొటోలు అంటించబడివున్నాయ్ ! పార్వతీపురం సిన్మాహాళ్లలో ఆడుతున్న సిన్మాల పోస్టర్లు అంటించే వెంకన్న వారానికి మూడుసార్లయినా వచ్చి సిన్మాబొమ్మలు అంటించి టీ త్రాగి పోతూంటాండు

కాసులుకు నలభై ఏళ్లుంటాయ్. ముందు వెనకా ఎవరూలేరు. చిన్నప్పట్నుంచీ హోటళ్లలో పనిచేసి – చేసీ పాతికేళ్లొచ్చేదాకా నానా చాకిరీతో అలసిపోయి, కూడబెట్టుకున్న కొద్దిపాటి డబ్బుతో ఓ శుభముహూర్తాన ఆ సెంటర్లో టీ పాక తెరిచాడు మొదట్లో అక్కడ గిరాకీ ఏమీఉండేది కాదు. అలా క్రమక్రమంగా దార్ని పోయేవాళ్లని అక్కడ హాల్ట్‌చేయాల్సిన పరిస్థితికి తీసుకురావడానికి పదిహేనేళ్లు పట్టింది కాసులుకు

పదిహేనేళ్ల క్రితం టీ పాక ఎలావుందో, ఇప్పుడూ అలాగే వుంది ఏమీ మార్పు రాలేదు అప్పటికి ఇప్పటికీ తేడా ఏమిటి అంటే పదిహేను పైసల టీ ఇరవై పైసలు కావడం, కొత్తగా రంగడనే కుర్రాడ్ని పెట్టుకోవడం

ఐదు పైసలు పెరిగినప్పుడు మొదట్లో అందరూ కాసులుమీద అలిగారు మరి కొందరు అభిమానంగా తిట్టారు ఇంకా కొందరు 'నీకూ డబ్బాశ పుట్టిందేట్రా ?' అని విసుక్కున్నారు

'ఏటి సెయ్యమంతారు బావ్! సూత్తన్నారు గదా – రోజు రోజుకీ సెరపంచికం ఎలా మండి పోతందో ! రూపాయి అట్టకెళ్తే ఏటొత్తంది సెప్పండి !' అనే కాసులుకు నిజంగానే డబ్బుమీద ఆశలేదు అందుకే ఇరవై పైసలు టీ కప్పుకి సెంటు పర్సెంట్ సంతృప్తికరంగా చేస్తున్నాడు

* * *

గుమ్మలక్ష్మీపురం ఫస్ట్ బస్ ఆగింది డ్రైవర్ రాముడు ఘాటైన పొడిపెంట

పొగాకు దట్టించిన తెగబారెడు చుట్ట వెలిగిస్తూ "ఒరే సన్నాసీ! దిగరా — టీ తాగుదాం" అని క్లీనర్‌కో కేకపెట్టాడు.

చిరుగుల చొక్కాకు మాసికల రగ్గు కప్పుకుంటూ దిగాడు సన్నాసి.

కాసులు రంగడ్ని లేపుతున్నాడు.

"లెగరా! బళ్ళొచ్చే ఏలయింది. ఇంకా నెగవేటి? ఎదవని ఎదవ — పాసిపుల్లచేసి కపిన్ని టీ నీల్లు తాగి పని సూడరా!"

రంగడు అటూ ఇటూ కదిలి చలికి ముణుచుక్కూర్చున్నాడు.

## ప్రారంభం!

"కాసులు మావా! రెండు స్ట్రాంగ్ టీ కొట్టుకో! అన్నట్టు పంతులు కండక్టరుకో స్పెషల్ టీ చేసుకో" అని ఆర్డర్ వేసి, గాడిపొయ్యి దగ్గర కర్రచెక్క వాల్చుక్కూర్చున్నాడు డ్రైవర్రాముడు

కండక్టరు పంతులు బ్యాగ్‌లో చిల్లర గలగల లాడించుకుంటూ వచ్చి "కాసులూ! టీలో సుగర్ ఎక్కువ. తెలుసుగదా" అని "ఏమిట్రోయ్! మీ వాడు ఇవాళ హుషారుగా లేడేమిటి?" అని రంగడ్నుద్దేశించి అన్నాడు.

"ఆడెప్పుడూ అంతే బావూ! పచ్చెదవ — పలికి ఇంత పెద్దోడ్ని నేను లెగిసి పనిసేత్తావుంటే— ఈడు మాత్తరం తెల్లారిపోతున్నా పాసిపుల్ల సెయ్యడు" అని "ఏరా! లెగమని సెప్తుంటే నీక్కాదేటి? లెగు!" అని ఓ కసురు కసిరేసరికి రంగడు అక్కడ్నుంచి లేచి, చూరుమన్న పుల్లతీసి, నోట్లో పెట్టుకొని నములుతూ పాక బయటకు నడిచాడు



# దేవుడు చూస్తూనే వున్నాడు...

"బేగి రారా! తెల్లగా తెల్లారిపోతావుంది" అని టీ చెయ్యడానికి సిద్ధమయ్యాడు కాసులు

మూడు నిముషాల్లో వేడివేడి టీ పొగలు క్రక్కుతూ ముగ్గురిచేతుల్లోనూ వుంది.

"నీ కాడ టీ సేనా బాగుంటదిరా మావా! అసలు టీ సేత్తే నువ్వేసెయ్యాల" అని ఓ కాంప్లిమెంటుపారేసి, "ఆఁ! మనమేటన్నా బాకీ వున్నానేమో ఆ పద్దు పుత్తకంసూడు" అన్నాడు డ్రైవర్‌రాముడు.

మూరువించి మాసిపోయి, అట్టలూడిపోయిన పుస్తకంలో గజిబిజిరాతలమధ్య రాముడి ఖాతా చాంతాడులా పెరిగి నలభై రూపాయలై కూర్చుంది

"ఇగో పంతులూ! సాయంత్రం లగేజీల్లో సూసుకుందాంగానీ ఓ యిరవై యిటియ్యి!" అని ఇరవై రూపాయలు తీసుకొని, కాసులకిచ్చి "మిగిలిన బాకీ మల్లొచ్చి నప్పుడిత్తాలే" అన్నాడు.

"నువ్వెప్పుడూ యింతేరా! సగమే యిస్తావు బాకీపైసలు తర్వాతంటావు. ఈలోగా కాతాపెరిగి మల్లీ ఎప్పటినాగే, ముప్ఫయి నలభై అయిపోద్ది" అన్నాడు కాసులు

"మరేటి పర్లేదులే! నాకాడ డబ్బులూ ఎటూ పోవు" అని చలికి ఆరిపోయిన చుట్టబెంటును నిప్పులో వూది వెలిగించి, "రైరో పంతులూ పోదామా" అడిగాడు యమహుషారుగా రాముడు.

"కానియ్యెహె! ఏటితొందర మించిపోతంది? నైన్‌సిక్స్ నాకొడుకు ఇంకా బండితియ్యలేదీ పాటికి స్లోగా ఎల్దాం!" సన్నాసి అన్నాడు

"ఈరగట్టంలో శీనుగాడు నగేజి అంతా నాగేస్తాడు. తరాత నీ యిట్టం" టీకెటిల్ పొయ్యిమీదపెడుతూ అన్నాడు కాసులు.

లగేజి అనగానే రాముడు గప్పున లేచాడు.

"ఎక్కురా ఎదవనాయాల! బేగిపోదాం! ఊరంత ఆశ నాకొడుక్కి దొంగెదవ టరినింగ్ కాడ మనబండిసూసిగాని ఆడు టేరింగుచ్చుకోడసలు" అని బస్సులోకి దూకాడు రాముడు

సన్యాసిగాడు రిజర్వాయర్ దగ్గరకెప్పుడు వెళ్ళాడోగాని, గట్టుమీదకూర్చుంటూ "అదికాదొరే అన్నాయ్! నైన్‌సిక్స్ నిన్నరాత్రి నాగూరుకాడ పేలయిందట. శీనుగాడు వొంట్లో బాగోనేదన్సెప్పి ఇంటికాడ తొంగున్నాడు బండి నాగూరుకాడ— శీనుగాడు ఇంటికాడ ఇంకెవుడెహె మనకడ్డు?" అంటూ బీడీ అంటించాడు

"నీ కంతే తెలుసురా ఎదవసన్నాసీ! శీనుగాడు కాప్పోతే, ఆడి బాబుగోడు తోలతాడుబండి. అసలే ఎంకట్నాయుడి బండీ అది. శీనుగాడు తొంగుంటే సాయంగా ఓ ఎరుగోడే టేరింగుచ్చుకుంటాడు. శీనుగాడికంటే ఆశపోతు నాకొడుకు ఎంకట్నాయుడు కండక్టుకి నగేజీల్లో వాటా పైసలు కూడా యివ్వడాడు" అని "తొందరగానెగేస్! సెప్తుంటే నీక్కాదేటి?" అని అరిచాడు రాముడు సీట్లోంచే.

సవిలాసంగా మరో దమ్ము పీల్చి "పంతులూ! ఏటో — ఈ ఎదవబతుకు అసలెందుకు పుట్టినానో నాకే తెలవకుంటున్నాది ఎదవ జీవితం దరిద్రగొట్టుజనమ. నాన్నేసొత్తే మాత్తరం ఏటవుద్దేటి?" విరక్తిగా అన్నాడు సన్నాసి

"ఏంట్రోయ్! వున్నట్టుండి వేదాంతంలోకి దిగేవ్! ఇంటిదగ్గర పెళ్ళాంతో ఏమైనా గొడవగానీ పెట్టుకున్నావా ఏంటి? ఇప్పుడేమైందని?" పంతులు అడిగాడు

"ఏటి సెప్పమంటావ్ పంతులు బాబూ! దానికి సిగ్గూ సెరం నేదు. దొంగనంజ ఆడునేడూ! ఎవుడు — ఆడే ఎంకటిగాడు. ఆణ్ణి మరిగింది ముండ. వానంటే ఇచ్చెం నేద్దానికి మొగుడు సత్తేగానీ ముండకి బుద్ధిరాదని — నాను నల్లకాట్లో కలిత్తేగానీ దానికి బుద్ధిరాదు" కోపంగా అన్నాడు సన్నాసి.

"అదా యిసయం! దానికోసం ఆడ కూకుని యిసారిత్తన్నావా! అవునూ! అన్నట్టు కొంపదీసి రిజర్వాయర్లోకి దూకవుగదా!" అనుకొని "బైటసూడ్రా! అరవుతావుంది అనక తీరిగ్గా ఆలోసిద్దువుగాని! ముందు బండెక్కరా తొత్తుకొడక్కానా!" అని ఓ కేకపెట్టి బండి స్టార్టుచేశాడు రాముడు

ఇక తప్పదన్నట్టు బీడీ పారేసి లేచాడు సన్నాసి

సన్నాసిగాడు బండిలోకి ఎక్కగానే స్పీడందుకుంది బండి.

ఆఘమేఘాలమీద పరుగులు తీస్తూ సాగిపోతోంది బస్సు.

* * *

ఊహించినవే అన్నీ జరుగుతూవుంటే విశేషాలేమీ వుండవు. ఊహించనివి జరిగినప్పుడే విశేషాలుగా చెప్పుకోబడతాయి అలాగే అన్ని ప్రయాణాలూ ఎప్పుడూ సుఖంగా జరగవు కొన్ని ప్రయాణాల్లో ప్రమాదాలు ఎదుర్కోక తప్పదు అసలు జీవన ప్రయాణమే ఒక పెద్ద ప్రమాదాల పుట్ట.

"గుమ్మనచ్చింపురం ఫట్టుబస్సు తిరగబడిపోనాదంట!"

"తోటపల్లి ఖానా టర్నింగ్ దగ్గర బస్సు పడిపోయిందట."

"ఫస్టుబస్సు బోల్తా కొట్టిందట తోటపల్లి కాడ."

క్షణాలమీద ఈ వార్త మూడు ముఖ్యకేంద్రాలకీ తెల్సిపోయింది.

"ఓలమ్మో! ఓర్నాయినో" అంటూ అందిన వాహనాలమీద మూడు వూళ్ళనుంచీ ప్రమాదస్థలానికి చేరుకున్నారు జనం తండోపతండాలుగా!

అందరికీ ఆతృతే!

ఏమయిందోఏమో! తమవాళ్ళకేం దెబ్బలు తగిలాయో! ఆ బస్సులో తమకు సంబంధించినవారు వున్నవాళ్ళ ఏడ్పులూ శోకాలూ చెప్పనలవి కాదు.

బస్సు మూడు పల్టీలుకొట్టి ఖానావంపు దగ్గర పల్లపు ప్రదేశంలోకి పడిపోయింది. చక్రాలు ఆకాశంవైపు చూస్తున్నాయి తల్లక్రిందులైన బస్సులోంచి చెల్లాచెదురైన సామాన్లు. బయటకు విసిరేయబడినట్లుగా పడివున్న బుట్టలూ, పెట్టెలూ, సూట్‌కేస్‌లూ . పగిలిపోయి, తుళ్ళిన గాజు పెంకులూ...

ఘోరంగా తలలుపగిలి చచ్చిపోయినవాళ్ళూ
భయంతో స్పృహతప్పిపోయినవాళ్ళూ...
బాగా గాయాలు తగిలినవాళ్ళూ.
కాళ్ళూ చేతులూ విరిగినవాళ్ళూ.

—వెరశి మొత్తమీద అక్కడి వాతావరణం చాలా భయంకరంగావుంది

ప్రమాదంనుంచి బ్రతికి బయట పడ్డవాళ్ళలో అస్సలు దెబ్బలుతగలకుండా మిగిలినవాళ్ళు ఇద్దరో, ముగ్గురోవుండి వుంటారు.

అక్కడకు చేరుకున్న వాళ్ళందరూ త్రొక్కుకుంటూ, త్రోసుకుంటూ, ఆతృతగా, గాభరాగా, తమకు సంబంధించినవాళ్ళని గుర్తుపట్టే ప్రయత్నంలో వున్నారు.

ప్రొద్దెక్కి అప్పుడే రెండుగంటలకుపైగానే అయ్యింది తొమ్మిదిగంటల వేళకు అక్కడచేరిన జన సమూహంలో, అందులోని కొందరి ఆక్రందనలతో వాతావరణం మరింత భీకరాన్ని సంతరించుకుంది.

ఆ దారిన పోతున్న ప్రతివాహనమూ అక్కడ ఆగి, ప్రమాదస్థలాన్ని సందర్శించి, తెలిసినవాళ్ళని పరామర్శించి మరీ వెళ్తున్నది

కేవలం యాక్సిడెంట్ ఎలా జరిగిందో చూడ్డానికి వచ్చినవాళ్ళు, ఆ ప్రమాదం ఎలా జరిగి వుంటుందో వూహిస్తూ చర్చలు సాగిస్తున్నారు.

ప్రమాదానిక్కారణాలు వివరిస్తున్నారుకొందరు ప్రత్యక్ష సాక్షులు

గజిబిజిగా, గోలగాచెప్తున్న వాళ్ళ మాటల్లోని విషయం తెలుసుకుంటే కారణం ఇది —

స్పీడుగా నడుపుతున్నబండికి అడ్డంగా ఇద్దరు కుర్రాళ్ళు సైకిలింగ్ ప్రాక్టీస్‌చేస్తూ రావడం, జోరుగావస్తున్న బస్సునుచూసి వాళ్ళిద్దరూ ప్రక్కకు తప్పుకోబోయి రోడ్డుమధ్య పడిపోగా, వాళ్ళను రక్షించడంకోసం అదేస్పీడ్‌తో టర్న్ తిప్పబోయి స్టీరింగ్ అదుపు తప్పడంతో, అగాధంలా వున్న పల్లపుమైదానంలోకి బండి పడిపోయిందని బోధపడింది.

"ఈ డ్రైవరుగాళ్ళు పరమ తాగుబోతులండీ! వెధవలు పీకమొయ్యా త్రాగేసి యిష్టంవొచ్చినట్టు నడుపుతుంటారు యాక్సిడెంట్లవకుండా వుంటాయా?" ఓ దొరబాబు యమఫోజుగా సిగరెట్ కాలుస్తూ ఈ టాపిక్‌లో డ్రైవర్లమీద విరుచుకుపడ్డాడు

"ఛ! ఛ! అందరూ అలాంటి వాళ్ళు కారండీ! మీరు అందర్నీ అలా అంచనా వెయ్యడం చాలా పొరపాటు ఇక్కడవున్న వాళ్ళలో ఎవర్నయినా అడగండి — డ్రైవర్‌రాముడెలాటివాడో ఎవరైనా చెప్తారు ఏ దురలవాట్లూలేనివాడు చీమకుకూడా హాని తలపెట్టని మనిషి," మరో పెద్దమనిషి అందుకున్నాడు

"అఫ్‌కోర్స్! కావచ్చు! కాని మోస్టాఫ్‌ది డ్రైవర్స్ అంతేనండీ!" తనవాదన్నే సమర్థించుకుంటూ అన్నాడు దొరబాబు

"శానా మంచోడ్రా! పాపం! యియాల ఆడికిక్కడ దిక్కులేని సావురాసి పెట్టివుందికాబోలు!

# దేవుడు చూస్తూనే వున్నాడు...

ఏటో – బగమంతుడి నిరనయం" మరోచోట డ్రైవర్ రాముడి మీద సానుభూతి జల్లులు కురుస్తున్నాయి.

పది గంటలు కావస్తూండగా పార్వతీపురం పోలీస్‌సర్కిల్ ఇన్‌స్పెక్టర్, వీరఘట్టంనుంచి ఎస్. ఐ., గుమ్మలక్ష్మీపురం హెడ్డు వ్యానుల్లోంచి దిగారక్కడ.

ప్రమాద స్థలానికి పాతిక గజాల దూరం జరగమని అందర్నీ హెచ్చరించారు. దర్యాప్తు ప్రారంభించి, వివరాలన్నీ ఫైల్ చేసుకొని, వాళ్ల తతంగమంతా పూర్తిచేసుకొనేసరికి మరో రెండు గంటలు పట్టింది.

ప్రెస్ ఫోటోగ్రాఫర్లు ఫోటోలు అవీ తీసుకున్నాక, అంబులెన్స్‌లో గాయపడిన వాళ్లందర్నీ ఎక్కించి పార్వతీపురం టౌన్ హాస్పటల్‌కు పంపించారు. గుర్తుపట్టిన శవాలను వాళ్లవాళ్లకు అప్పగించారు. కొన్ని మరీ గుర్తుపట్టలేనంత రక్తపు ముద్దలుగా మారిపోయాయ్. వాటిని వ్యాన్‌లో ఎక్కించి వేరే హాస్పటల్‌లోని ప్రిజర్వేటివ్ సెల్‌కు తరలించారు.

సాయంత్రం ఐదు గంటలయ్యేసరికి చాలా కార్యక్రమాలు పూర్తిచేశారు.

గాయపడిన పాతికమందిలో కండక్టర్ పంతులూ వున్నాడు అతనికి కుడిచెయ్యి విరిగింది అంత ప్రమాదస్థితిలోనూ అతని చెయ్యి క్యాష్‌బ్యాగ్‌ను గట్టిగా పట్టుకొనేవుంది

మరణించిన ఇరవైమందిలో డ్రైవర్ రాముడూ, క్లీనర్ సన్యాసీ కూడా వున్నారు. రాముడి శవం గుర్తుపట్టలేనంతగా స్టీరింగ్‌కూ, సీటుకూ మధ్య నలిగిపోయింది.

కాసులు టీ కొట్టు మూసేసి ఆ రోజు సాయంత్రం దాకా ప్రమాదం జరిగినచోటనే వున్నాడు.

"మావా! నా దగ్గర డబ్బులు ఎక్కడికీపోవు. బేంకులో ఏసుకున్నట్టే అనుకో" అనేవాడు. ఎప్పుడూ హుషారుగా, సరదాగా తానున్నంతసేపూ వాతావరణంలో నవ్వుల్ని పంచిపెట్టే డ్రైవర్ రాముడు ఏడీ! రెండు ట్రిప్పుల్లోనూ క్రమం తప్పకుండా బస్సాపి తన దగ్గర టీ తాగివెళ్లే రాముడు ఇక లేడు కాసులు నిజంగానే ఎంతో విచారించాడు.

'పంతులు బాబు కెట్టావుందో! సెయ్యి తీసేత్తారుగావోలు! పాపం! ఉద్యోగం ఎట్ట జేస్తాడో ఏమో!" అనుకుంటూ, చీకటి పడుతూండగా పాకవైపు దారితీశాడు కాసులు

చలికాలపు పగళ్లు చాలా తొందరగా గడిచిపోయినట్టనిపిస్తాయి. ఎండకాస్తున్నా ఓ వైపు నుంచి చలి చంపేస్తూ వుంటుంది. ఎండలో వేడి తగ్గిన దగ్గర్నుంచీ దాని ప్రభావం మరింత ఎక్కువనిపిస్తుంది.

సాయంత్రం ఆరుగంటలయ్యింది. ఎడ్లు గూళ్లకు చేరుకుంటున్నాయి. సొమ్మలకాపు గుంటలు నాగావళి నదిలో కేరింతలు కొడుతూ ఈదులాడుతున్నారు ఇసుకలో పడుకొన్న పశువులు నిదానంగా నెమరేస్తున్నాయి. ప్రమాదస్థలం నుంచి అందరూ వీడ్కోలు తీసుకున్నారు.

"ఏట్రా కాసులూ! యియ్యాల కొట్టుకు సెలవెట్టేసినావేటి? టీ సుక్కల్లేకపోతే సచ్చినా మనుకో!" అప్పుడే ఆగిన లారీలోంచి ఓ డ్రైవర్ దిగుతూ అన్నాడు.

వీరఘట్టం నుంచి జనపనార బేళ్లు తీసుకెళ్తున్న లారీ అది. దాని ఓనరు సెంద్రినాయుడు. ఆ చుట్టుప్రక్కల నాలుగు వందల ఎకరాలు సెంద్రినాయుడివే లెక్కకందని లకారాల్లో మునిగి తేలుతున్న సెంద్రినాయుడెన్ని వ్యాపారాలు చేస్తాడో అంతుబట్టదు. ఎందులో చూసినా నాయుడి పాత్ర కనిపిస్తుంది. నాటుసారా దగ్గర్నుంచి నాపరాళ్ల దాకా ఏ వ్యాపారమైనా చెయ్యగలడు ఐదు బస్సులూ, పది లారీలూ, మూడు మెటాడార్ వ్యాన్లూ వున్నాయి అతడికి దేశంలోని ఏ మూలకైనా తన సరుకు రవాణా చెయ్యగలసత్తా వుంది.

నాయుడికిన్ని వ్యాపారాలతోపాటు కాస్త వితరణ గుణం కూడా వుంది. అంచేత ఆయన దగ్గర పని చేసే వర్కర్లు సంతోషంగా, హాయిగా వుంటారు ప్రతి సంవత్సరం కొత్తబట్టలు పెడతాడు అందరికీ, ప్రతి పండుగకీ మామూళ్లుగా పది రూపాయలు యిస్తాడు. అదిగాక అడ్వాన్సులనీ, అవనీ యివనీ అందరూ ఎంతో కొంత ఎక్కువే పుచ్చుకుంటారు. "పోనీ! నా మనుషులే కదా తింటున్నారు. వాళ్లకు నేను తప్ప ఎవరిస్తారు?" అనుకుంటాడు చంద్రినాయుడు. అందుకే తమకు చెప్పిన పనులే కాకుండా నాయుడికక్కావలసిన యితర పనులు కూడా స్వయంగా అడిగి తెల్సుకొని, చేసి పెడుతుంటారు వాళ్లు.

డ్రైవరు ప్రశ్నకు కాసులు బదులు చెప్పలేదు

"టీ అడిగితే మాటాడవేట్రా కాసులూ! పాల్లేవేటి?"

"ఓరి అప్పన్నా! ఎప్పుడొచ్చినావురా నువ్వు? ఈడనే నాలుగు ఫర్లాంగులవత్తల నక్షింపురం బండి తిరగబడిపోందని నీకు తెల్దేటి! ఓరోరోరే! ఎంత గోరం జరిగిపోనాదనుకున్నవ్! సగం మంది సచ్చిపోనారు" కాసులు కన్నీళ్లెట్టుకుంటూ అన్నాడు

"ఏటోరే! నీ వోల్లెవులో పోయినట్టు బాధ పడిపోతన్నావేటి?" అడిగాడు డ్రైవరు ఎకసక్కెంగా

"తమాసాక్కాదురా! పెమాదం కాడ సూత్తే ఎవుల్లకయినా దుక్కం వత్తాది. ఎంత రగతపాతం జరిగిందనుకుంతన్నావ్! నువ్వు సూత్తే ఈ మాటనేవోడివి కాదురా!" కాసులు గాద్గదికంగా అన్నాడు.

"సరి సర్లె! యియ్యాల నాకు టీ సుక్కల పేప్తినేదన్నమాట. అంతేగా!" విసుక్కున్నాడు అతడు.

"ఈ రోజింక నానే టీ సెయ్యలేను. కళ్ల ముందింకా ఆ గోరమే మెదుల్తావుంది" కాసులు నిజంగానే బాధపడ్డాడు

* * *

ప్రమాదం జరిగిన మూడురోజుల అనంతరం బండిని తీయడానికి ప్రయత్నాలు ప్రారంభించారు పాతికమంది జమాజెట్టిల్లాంటి మనుషులు మోకులూ, పలుపులూ, రాటలూ, గునపాలూ వంటి సాధనాలతో అక్కడకు చేరుకున్నారు.

కథాకాలం నాటికి శ్రీకాకుళం జిల్లాలో అధిక భాగం రూట్లు జాతీయం కాలేదు. ఆర్ టి సి బస్సులు అంటే ఏమిటో తెలియదు అధికభాగం ప్రజలకు. ప్రైవేటు యాజమాన్యం బస్సులే నడుస్తుంటాయి ఆ రూట్లలో డబ్బా బస్సులకు బ్రహ్మాండంగా రంగులు వేసి తయారుచేస్తారు ఈ బస్సులు సాధారణంగా బ్రేక్ ఫెయిల్ కావటమో, టైర్లు ఫేలడమో, ఫ్యాన్ బెల్టూడిపోవడమో వంటి చిన్నా పెద్ద అవాంతరాలకు గురౌతుంటాయి ఈ బస్సులను అజమాయిషీ చేయడానికి బ్రేక్ యిన్‌స్పెక్టర్లు వుంటారు. వీళ్లు సడన్‌గా దాడులు నిర్వహించి సాధారణంగా ఓవర్ లోడింగ్ వంటి కేసులు పట్టుకుంటారు అవినీతి మొదట్లో తెర చాటున జరిగి, ఇటీవల అలవాటుగా మారిపోయిన కారణంగా బాహాటంగానే 'కాస్త ముడుపు' చెల్లించుకుంటే, కేసు బుక్ చెయ్యరు కొందరు మరి కొందరు సూర్యచంద్రుల సాక్షిగా పుచ్చుకోడానికి యిష్టపడక, కేసు రాస్తామని ఆర్భాటం చేస్తారు వాళ్లని చెట్టుచాటుకో, గట్టు చాటుకో తీసుకెళ్లి ఈ పిడికిలిలో వున్నది ఆ పిడికిట్లోకి వెలుగు చొరవకుండా ట్రాన్స్‌ఫర్ చేస్తారు ఓనర్లు అంటే వీళ్లు ఎంత యిస్తున్నారో, ఎంత పుచ్చుకుంటున్నారో రెండో కంటివాడికి తెలీదన్నమాట! ఈ ట్రిక్స్ చాలా పాతవే అయినా వాటిని ప్రజంట్ చెయ్యడంలో ప్రతిసారీ ఏదో వెరైటీ చూపిస్తుంటారు వీళ్లు.

తిరగబడిన బండీ చాలా భాగం శిథిలమైపోయింది దాన్ని యథాస్థితిలో నిలబెట్టినా ఆ పల్లంలోంచి రోడ్డుమీదకు తీసుకురావడం అసంభవం ఇంజన్‌తోసహా చాలా పార్ట్స్ విరిగిపోయాయి. దాన్ని తుక్కు క్రింద అమ్ముకోవాల్సిందే అన్నంతగా పాడయిపోయింది

సదరు బస్సు ఓనరు ధర్మరాజు

ధర్మరాజు నిజంగా ధర్మాత్ముడేమీ కాదు అలాగని అధర్మరాజూ కాడు చాలామందిలాగే అతడూ అతిమామూలు వ్యక్తి కాకపోతే కాస్త డబ్బున్నవాడు కొద్దిపాటి తెలివితేటలున్నవాడు అందుకే తెలివితేటల్నీ డబ్బునీ వినియోగించి బస్సు కొన్నాడు దానిమీద వచ్చిన లాభంతో ఓ యిల్లు కొన్నాడు అంతే తప్ప డబ్బును డబ్బుగా వుంచలేదు.

ప్రస్తుతం ధర్మరాజు కిప్పుడేం చేయాలో తోచలేదు. కాని బస్సుమీద ఆశ కూడా చావలేదు ఖర్చయితే అయ్యిందిగాని ఏ పార్టు కాపార్టు విడదీసి రిపేరు చేయిస్తే, తర్వాత విశాఖపట్నం తీసుకెళ్లి ఓ పదివేలు పారేస్తే బస్సు ఓ కొలిక్కి వస్తుందేమో! ఎందుకంటే మళ్లీ ఇంకొకటి కొనాలంటే యాభై – అరవై వేలు లేందే రాదు అదీ సెకెండ్‌హాండ్ బండి ఖరీదు అచ్చంగా కొత్తదే కావాలంటే ఖచ్చితంగా ఒక లకారం వుండాల్సిందే!

ఇవన్నీ ఆలోచించుకొన్న తర్వాతనే ధర్మరాజు బండిని తీసే ప్రయత్నాలు ప్రారంభించాడు

మొత్తమ్మీద ప్రమాదానికి సరైన కారణాలెవరూ తేల్చి చెప్పలేకపోవడంతో, ధర్మరాజు మీద నష్టపరిహారం కేసు పడలేదు దెబ్బలు తగిలి

ప్రకృతి రహస్యం కనుగొనబడింది




# ఇది సహజంగా, మృదువుగా మీ వంటి చాయను పెంపొందిస్తుంది

**చర్మానికి నలుపుదనం ఎలా సంక్రమిస్తుంది**

ఏమిటీ, కాలక్రమేణా మన వళ్లు నెమ్మది నెమ్మదిగా నల్లబడుతుందా ? అవును, ఇది లోపల నుంచీ, బయట నుంచీ కూడా రెండు విధాల జరుగుతుంది. మీ చర్మం లోపల ఒక నల్లని రంగు పదార్థం ఉంది. చర్మపు నలుపు దనానికి ఇదే కారణం. ఇది ఎంత హెచ్చుగా ఉంటే మనుషులు అంత నల్లగా ఉంటారు.



ఇది ఇలా ఉండగా, మీరు ఎండలోకి వెళ్లినప్పుడల్లా సూర్యుని అల్ట్రావయొలెట్ కిరణాలు మీ చర్మంలో ప్రవేశిస్తాయి. దాంతో మీరు మరికాస్త నల్లబడతారు.

**వంటి చాయను పెంచడానికి పురాతన పద్ధతి ఏదైనా ఉందా ?**

వందలాది సంవత్సరాలుగా ఆడవారు— సెనగపిండి, పాల మీగడ, నిమ్మరసం, గ్లిసరీన్ ఇంకా ఏవేవో ఉపయోగిస్తూ వస్తున్నారు. వీటి మూలంగా చర్మం మెత్తబడి కాస్త మెరవచ్చు. అంతేగాని చర్మాన్ని నిజంగా ఎర్రగా చేయలేవు. మరొక తెగకు చెందినవి బ్లీచింగ్ పదార్థాలు. ఇవి ఎంత హానికరమైనవో వేరే చెప్పనక్కర్లేదు. అపురూపమైన మీ పట్టు బట్టల్ని మీరు బ్లీచ్ చేస్తారా ? మీ చర్మం కూడా పట్టులాగ నాజూకు అయినది. పట్టుకంటె అపురూపమైనది.

**విజ్ఞాన విజయం ! ఫెయిర్ అండ్ లవ్లీ సహజంగా, మృదువుగా తన పని చేస్తుంది.**

ఫెయిర్ అండ్ లవ్లీ విజ్ఞాన ప్రపంచం సాధించిన విజయం. ప్రపంచంలో మొట్టమొదటిసారిగా, సహజంగా, మృదువుగా మీ శరీర చాయను ఎర్రబరిచే సాధనం ఇది. ఫెయిర్ అండ్ లవ్లీ క్రీమును మీరు రాసుకున్నప్పుడు, అది మీ చర్మంలోకి ప్రవేశించి పనిచేస్తుంది—సహజంగా, మృదువుగా, సురక్షితంగా. దాంతో, మీ శరీర చాయ ఇతరులు మెచ్చుకొనేలా ఎర్రబడుతుంది.



అంతేకాదు ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని బయటనుంచి కూడా సంరక్షిస్తుంది. దీనిలో సూర్య కిరణాలను వడబోసే పదార్థాల మిశ్రమం ఉంది. ఇది ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను వడబోసి మీ చర్మం ఎండ వల్ల నల్లబడకుండా కాపాడుతుంది. అయినప్పటికీ సూర్య కిరణాలలోని ఆరోగ్యమంతటినీ మీరు పూర్తిగా పొందగలుగుతారు.

**6 వారాలకు మీకే తేడా కనపడుతుంది !**

వాడి చూస్తే మీకే రుజువు అవుతుంది. ఫెయిర్ అండ్ లవ్లీని ఆరు వారాలపాటు నియమంగా వాడితే, మీతో పాటు ఇతరులు కూడా మీ వంటి చాయలో మార్పును గుర్తిస్తారు. ప్రకృతి సహజమైన రీతిలో మీ చర్మాన్ని లొంగదీస్తుంది ఫెయిర్ అండ్ లవ్లీ.

**ఫెయిర్ అండ్ లవ్లీ క్రీమ్ నల్ల చర్మాన్ని ఎర్రబరచడంతో పాటు ఇంకా చేస్తుంది.**

ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మానికి కోమలత్వం సమకూరుస్తుంది. మనోహరమైన సువాసన చేకూరుస్తుంది. రోజుకు కనీసం ఒకసారి వాడండి. రెండు సార్లు వాడితే మరీ మంచిది. నియమంగా వాడితే, మీ వంటి చాయ పెంపొందుతుంది, అలాగే ఉంటుంది. సహజంగా, మృదువుగా ఎరుపెక్కుతుంది.









**ఫెయిర్ అండ్ లవ్లీ — నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు**

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

లింటాస్—FALOV.10 254 TL

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనకు ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరు మీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

# దేవుడు చూస్తూనే వున్నాడు...

వాళ్లకు హాస్పటల్ ఛార్జీలు, మందుల ఖర్చులు మాత్రం అయ్యాయి. కాని వీటిమీద సుమారుగా పదిహేను వేల రూపాయలు వదిలిపోయాయి ధర్మరాజుకు.

ఈ ఖర్చుతోపాటు బండి లేవనెత్తడానికి కూలీలు రెండు వేల వరకూ అడిగారు. బండి పనికొస్తుందనే ఆశ వుండడంవల్ల ఈ ఖర్చు భరించడానికి సిద్ధపడ్డాడు ధర్మరాజు.

అంతకు ముందు రోజు భారీగా వర్షం పడింది. వల్లంలో నీళ్లు బాగా నిలిచాయి. అక్కడ మట్టి కూడా మేట వేసి బస్సు మరికొంత కూరుకుపోయింది. దాన్ని తీయాలంటే ప్రత్యేకం సాగించాల్సిందే!

నలుగురైదుగురు త్రవ్వకం మొదలెట్టారు. ఓ అరడజనుమంది మోకులు కట్టి లాగే ప్రయత్నంలో పడ్డారు. ఓ పదిమంది పొడుగుపాటి రాటల్ని బస్సుకు దన్నుపెట్టి లాగుతున్నవాళ్లకు సహకరిస్తున్నారు. మరో ఐదుగురు పలువులు పట్టుకొని హైరానా పడుతూ అటూ ఇటూ తిరుగుతున్నారు

"జాగ్రత్తారే! ఇప్పటికే బండి నాశనమైంది. మీ బలప్రయోగంతో దాన్ని మరింత పాడుచెయ్యకండి" అని జాగ్రత్తలు చెప్తూ ధర్మరాజు దగ్గరుండి బండిని రోడ్డుకు తరలిస్తున్నాడు.

గునపం పోట్లకు, లాగుతున్నవాళ్ల ప్రయత్నానికి బండి కొద్దిగా పైకి లేచింది. బండిలో కదలికకు హుషారొచ్చిన పనివాళ్లు తమ శక్తికొద్దీ దాన్ని బయటకు తీయడానికి ఉత్సాహంగా సిద్ధపడ్డారు.

"ఖంగ్! ఖంగ్" మన్న శబ్దానికి ఎటో చూస్తున్న ధర్మరాజు ఇటు తిరిగి "ఎదవ! మెల్లగా తవ్వరా అంటే ఏమిట్రా, గట్టిగా బండి బొక్కడి పోయేలా పొడిచేస్తున్నారు" విసుక్కున్నాడు.

"నేదు బాబూ! ఏదో రాయికి తగిలుంటాది" అని అక్కడే త్రవ్వి, రెండు మీటర్ల పొడుగున్న రాయిని బయటకు తీశాడు ఒక కూలీ.

ఆశ్చర్యం! అది రాయి కాదు శ్రీ వేంకటేశ్వర స్వామి విగ్రహం.

అది అక్కడి కెలా వచ్చిందో ఎవరికీ తెలీదు అందరి ఆశ్చర్యాలకూ అంతులేదు. గునపం దెబ్బలకు కిరీటం కొంత భాగం విరిగిపోయింది అయినా ముఖమూ, మిగతా శరీరమూ చెక్కుచెదరలేదు.

త్రవ్విన కూలీ వెంటనే సాష్టాంగపడిపోయి "మన్నించు సామీ! మన్నించు. అపసేరం జరిగిపోనాది తెలీక సేసిన ఈ అపరాదానికి ఈ ఎదవని సెమించు సామీ! నువ్వు ఈడున్నావని నాకేటి తెలుస్తాది సెప్పు ఎదవన్నరెదవని నిన్ను పొడిస్సినాను" అని లెంపలు వాయించుకోసాగాడు

పాతికేళ్ల క్రిందట ధర్మరాజు చిన్నతనంలో ఎప్పుడో నాగావళికి ఉధృతంగా వరదొచ్చిందట ఆ వరదలో ఊళ్ళూ – పూళ్ళూ ఏకం అయిపోయాయట. పది రోజులదాకా వరదనీరు తియ్యలేదట బహుశా ఆ సమయంలో ఈ నది ఒడ్డున మరెక్కడో వున్న ఏ దేవాలయమో గంగా ప్రవాహంలో మునిగిపోయుంటుంది నీటి వరవడికి అది ఇక్కడకొట్టుకొచ్చి ఈ వల్లంలో ఇసుకమేటలో కల్సిపోయి వుంటుంది. అయితే ఇన్నాళ్ళూ అక్కడ త్రవ్వకాలు సాగించాల్సిన అవసరం ఎవరికీ కలుగకపోవడంవల్ల ఈ రాయి బయల్పడలేదు – అని ధర్మరాజు అనుకుంటున్నాడు. బహుశా ఇలా జరగడానికి అవకాశం కూడా వుందని ఆమధ్య ఎక్కడో ఏ నది వద్దనో పురాతన ఆలయం నీట మునిగి, విగ్రహం కొట్టుకొచ్చిందనీ, దానికి అక్కడ గుడి కట్టారనీ పేపర్లో చదివాడు ధర్మరాజు.

కాని మళ్లీ అంతలోనే ధర్మరాజు సంశయంలో పడ్డాడు.

ఇంతకీ యిదసలు దేవుడి ప్రతిమేనా? లేక ఆకారంలో ఆ విధంగా వుందా? అని పరికించి చూశాడు.

లేదు నిజమే. శంఖ చక్రాలు, నామాలూ స్పష్టంగా కన్పిస్తూంటే ఇంకా అనుమానమేమిటి?

అయితే ఈ దేవుడ్ని ఏం చెయ్యాలి?

బయటపడిన విగ్రహానికి ఆలయం కట్టించక తప్పదంటారు పెద్దలు.

ఆలయం కాకపోతే మానె, కనీసం చిన్న గుడయినా కట్టించగలడా తాను. మళ్లీ ఈ ఖర్చొకటా? గుడి కట్టించకపోతే ఏమిటౌతుంది అసలు?

ధర్మరాజు నాస్తికుడు కాదు అలాగని గొప్ప ఆస్తికుడూ కాదు దేవుడంటే భయభక్తులున్నాయి కొన్ని సెంటిమెంట్లు, మూఢ నమ్మకాలు వున్నాయి గుడి కట్టించకపోతే దేవుడు తనకు అపచారం జరిగినట్లు భావిస్తే ...

అయితే తనవల్ల జరగని ఈ పని మరి కొందరితో కలిసి చేయవచ్చు కాని ఎవరు ముందుకొస్తారు? గుడి కట్టిస్తాం – చందాలివ్వండి అంటే యిస్తారా? 'అడుక్కొనేవాళ్లు రకరకాలుగా, వేస్తుంటారు వేయి వెధవ వేషాలు' అనుకుంటారేమో!

ధర్మరాజు బుర్రలో రకరకాల ఆలోచనలు సుళ్లు తిరుగుతున్నాయి.

"ఈ సామిని ఏటి సేత్తారు బావూ!" ఓ కూలీ అడిగాడు అప్పుడే

"అదే ఆలోచిస్తున్నారా! ఏమీ పాలుపోవడం లేదు" ఎటో చూస్తూ అన్నాడు ధర్మరాజు

"బయల్పడిన యిగ్రాలకు గుడి కట్టించాలంట కదబావ్" మరొకడన్నాడు

"అవునండయ్యా! ఆడన్నమాట నిజవే!" వాడి మాటను మరొకడు బలపరిచాడు

"మీకెందుకురా యివన్నీ! మీ పనేదో మీరు చూసుకోక" విసుక్కున్నాడు ధర్మరాజు

ఉన్నట్టుండి చటుక్కున అతడి బుర్రలో ఫ్లాష్ లైట్‌లా ఓ ఆలోచన మెరిసింది

అంతే! ఈ దెబ్బతో అనామకంగా పడివున్న ధర్మరాజు పేరు దశదిశలా మార్మోగి పోవలసిందే - అనుకున్నాడు ధర్మరాజు

**(ఇంకా వుంది)**

# సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు



## మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు

మీ బట్టలకు కళ్లు తిప్పుకోలేనంత తెల్లదనం—క్రమం తప్పకుండా సూపర్ రిన్‌తో ఉతికితే వాటి తెల్లదనం అద్వితీయం. మరే ఇతర డిటర్జంట్ బిళ్ల లేదా బార్ కంటే మరింత తెల్లటి తెలుపునిస్తుంది సూపర్ రిన్. ఎందుకంటే, సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ.




దీని తెలుపు చేసే శక్తిని మీకు మీరే ఋజువు చేసుకోండి:

మరే ఇతర డిటర్జంట్ బార్‌తోనైనా ఉతికినది





సూపర్ రిన్‌తో ఉతికినది

హిందూస్థాన్ లివర్ వారి విశిష్ట ఉత్పాదన

సూపర్ రిన్‌లో తెలుపు చేసే శక్తి ఎక్కువ

లింటాస్-RIN. 40-2316 TL

# దొంగ


(18వ పేజీ తరువాయి)


కప్ప కూడా అంతే చేసేడు–

ఒక చేత్తో ఫైలూ, రెండో చేత్తో బస్సుకున్న నిలువు గజంపట్టుక నిలబడ్డా వరాహం మాత్రం, "నాదీ మంత్లీ పాసే!" అన్నాడు జేబులో చెయ్యి పెట్టడానికి ఓపిక లేక –

"చూపించండి సార్ !" అన్నాడు కండక్టరు పట్టువదలని విక్రమార్కుడిలా.

మరి తప్పదు కాబట్టి, పాసు కోసం పట్నాం జేబులో చెయ్యి పెట్నాడు వరాహమూర్తి – అతడి ముఖం ఫోకస్ తక్కువయిన ఫోటోలా వెలవెల బోయింది వెంటనే రెండో జేబు తడుముకున్నాడు. మరింత పాలి పోయింది ముఖం. లాల్చీ జేబులు తడుముకున్నాడు. సోషవచ్చి, తెలివి పోతున్నట్టు, తడి ఆరిపోయిన గొంతుతో అరచేడు... "పర్సు ! నా పర్సు !"

"ఏమయింది మీ పర్సు?" కొంగ శ్రేయోభిలాషించేడు.

"పోయింది! పర్సు పోయింది! నా పర్సు పోయింది !" గావుకేక పెట్టేడు వరాహం.

"పర్స్ పోయిందా ! బస్సు ఎక్కుతున్నప్పుడు ఎవడో కొట్టేసి వుంటాడు !" కప్ప బెకబెక లాడేడు, తన పర్సు బ్యాగ్‌లో వున్నందుకు అభినందించుకుంటూ !

"బస్సు ఎక్కేక జేబుని చెక్ చేసుకున్నావండీ ! వుండింది ! దొంగ ఈ బస్‌లోనే వున్నాడు ! నా పర్స్ ఈ బస్‌లోనే వుంది! కండక్టర్‌గారూ ! బస్ ఆపి అందర్నీ చెక్ చెయ్యండి!" హుకుం జారీ చేసేడు తనకేదో పవరున్నట్టు.

"ఎంత వుందండీ పర్స్‌లో?" ఒకరి ప్రశ్న !

"నే చెప్పను ! చెప్పేస్తే దొంగకి పర్స్‌లో ఏంతుందో తెలిసిపోతుంది. ఆ పర్స్ తనదే వంటాడు ఎంతసొమ్ముందో చెప్పి! పర్స్ దొరికేక చెప్తాను ! అప్పుడు మీరు సొమ్ము లెక్కపెట్టొచ్చు !" వరాహం మెదడు సీమ చాకులా పనిచేసింది !

"హోల్డాన్! హోల్డాన్!" అంటూ విషల్ కొట్టేడుకండక్టర్ పెదవులలోంచి గాలివదిలి– "పాసింజర్సెవురూ కదలకండి బాబూ ! గేటుకాడ విల్నాని ఒక్కోర్ని దిగమని అందరి జేబులూ సెక్‌జేస్తాం ! ఎవ్వరూ తప్పు పట్టకండి ! యిది డబ్బుతో ఎవ్వారం ! ఇయాళీయన కయింది! రేపు తవంకవొచ్చు !" అంటూ ఓ చిన్న ఉపన్యాసం ఇస్తూ ఉండగా బస్సు ఊగి ఊగి, ఆగనా మానవా, ఆగనా మానవా అనుకుంటున్నట్టు బ్రేకు కొట్టగా కొట్టగా ఆగింది.

పాసింజర్సులో కొందరు "తప్పకుండా ! అలానే కానీండి !" అన్నారు మరికొందరు ఈ అంతరాయానికి విసుక్కున్నారు. "పోయిన పర్సు మరి దొరుకుతుందిటండీ మీ పిచ్చికాని ! " అంటూ పెదవులు విరిచారు కొందరు. "దొంగ లోనే ఉన్నా పర్సు ఈపాటికి బైటికి పోయేఉంటుంది!" అన్నాడొకాయన. అందరూ తమ జేబులు తడుముకున్నారు. తమ పర్సులున్నాయో పోయాయోనని ఆడవాళ్ళు హేండ్‌బ్యాగ్‌లు ఓసారిచూపి డబ్బు ఉందో పోయిందో చెక్‌చేసుకున్నారు.

బస్సు ముఖ్యమయిన దారిన వెళ్తూ ఉండడంవల్ల రోడ్డుమీద రద్దీ ఎక్కువగా ఉంది బస్సు ఆగగానే కండక్టరు కిందకి గెంతి ఒక తలుపు దగ్గర నిలబడ్డాడు. వరాహంకివినబడేలా అరిచేడు, "తంవరు రెండో గేటుకాడ కాయండి !" "అలాగే !" అంటూ తన ఫైలు కొంగకి అందించి అతడు దిగటంలో పడ్డాడు. ఎవ్వరూ బస్సుదిగరాదని శాసించబడింది కాబట్టి, అతడు దిగడం ఆలస్యమయింది.

ఇంతలో...

పుట్టలోంచి పాము సరసరా బయటకు పోయినట్టు, ఒక పాతికేళ్ళ యువకుడు, బస్సు అనే ఈ పుట్టలోంచి సర్రున బయట పడ్డాడు. "ఏయ్ ! ఎవురు నువ్వు ! ఆగాగు! నీ పాకెట్ చెక్ సెయ్యనీ !" కండక్టర్ ఇంజన్ దగ్గరున్న ద్వారం దగ్గర్నించి కేక వేసేడు

వెనక ద్వారం నించి గెంతిన యువకుడు వినిపించుకోలేదు. దర్జాగాదిగి కాలరెత్తుకొని, నడిచి తక్కిన జనసమూహంలో రోడ్డుమీద కలిసి పోబోయేడు. అంతలో వరాహం బస్సులోంచి గెంతి, "ఏయ్ మిస్టర్ !

# కాంగ్రెస్ కేక్

కావల్సిన వస్తువులు :

తాజామైదా– 200గ్రా, పంచదార– 250గ్రా, గోవా–100గ్రా (లేక గులాబ్జాం పవుడర్ చిన్నపేకెట్), డాల్డా – 200గ్రా, యాలకులు – 5లేక6, (పొడి చేసి పెట్టుకోవలెను) మిఠాయి రంగులు– ఆకుపచ్చ, ఆరంజి (ఒక్కొక్కటి చిటికెడు కొద్దినీళ్లలో విడివిడిగా కలిపివుంచుకోవలెను )

తయారుచేయు విధానం :

బాణలిలో డాల్డావేసి బాగ వేడికాగానే క్రిందికిదించి అందులో మైదావేసి వేయించి కమ్మని వాసనరాగానే అందులో గోవావేసి బాగా కలిపి వుంచుకోవాలి. అందులో యాలకుల పొడివేయాలి. తర్వాత కంచు గిన్నెలోగాని దళసరిగావున్న స్టీలుగిన్నెలోగాని పంచదారపోసి కొద్దినీళ్ళుపోసి స్టౌమీదపెట్టి తీగపాకంరాగానే కిందకిదింపి పెట్టుకొని, తయారుచేసి వుంచిన మైదా ముద్దను అందులోవేసి చెయ్యివిడవకుండా కలపాలి. ఆ గిన్నెవేడికే గట్టిపడుతూ వస్తుంది. గట్టిపడే తరుణంచూచి దాన్ని మూడు భాగాలు చేసుకుని ఒక భాగంలో కలిపివుంచుకొన్న ఆకుపచ్చరంగు నీళ్ళుపోసి బాగా కలిపిన తర్వాత ఒక పళ్ళానికి నెయ్యిరాసి అందులో వేసి బాగా నెరపవలెను. దానిపై రెండో భాగాన్ని తెల్లదేవేసి నెరపవలెను. దానిపై మూడో భాగాన్ని ఆరంజి రంగునీళ్లు పోసి బాగా కలిపి దానిపై నెరపవలెను. చల్లారిన తర్వాత కేకులుగా కోసి తీయవలెను. కేకులు కాంగ్రెస్ జెండా "షేపు"లో చూడ ముచ్చటగా, రుచిగా వుంటాయి.

— డి. నాగరత్నమ్మ

---

ఆగగు!" అన్నాడు... కాని "ఏతే దొంగ!" అనడానికి సాహసించలేకపోయేడు!

ఎందుకంటే...

ఆ యువకుడు స్టెప్ కటింగ్–క్రాపుతో, అందంగా పెంచుకున్న మీస సంపత్తితో, తెల్లని బెల్‌బాటమ్ పంట్లాంలోకి టక్ చెయ్యబడ్డ పాలిస్టర్ కమీజుతో, మీద ఒక బొత్తాము వదిలీగా మెడలో ధగధగా మెరుస్తున్న ఒంటిపేట బంగారు గొలుసతో, కాళ్ళకి ఎత్తు మడమల జోడుతో, చేతికి ఎలిక్ట్రానిక్ వాచీతో యూనివర్సిటీ స్టూడెంట్లా వున్నాడు. హిందీ సినిమాలోని లేటెస్ట్ హీరోలా వున్నాడు.

అతడు వినిపించుకోకుండా పారిపోతూ వుండగా, వరాహం వదల్లేదు. వేదాలని ఎత్తుకపోయిన రాక్షసుడ్ని వరాహమూర్తి వెంట పడ్డట్టు వెంటపడి. "ఏమండోయ్! అతడ్ని ఆపండి!" అంటూ రోడ్డుమీద పాంథులకి కేకపెట్టి తను పరుగున ఆ యువకుణ్ణి సమీపించబోగా, ఆ యువకుడు పరుగు తీసేడు. ఇంక సందేహం ఏముంది?! "దొంగ! దొంగ! పట్టుకోండి వాడ్ని!" అంటూ కేకపెట్టేడు వరాహం– తన శక్తివంతా కూడతీసుక పరుగు తీసేడు.

రోడ్డు దాటబోయిన ఆ యువకుడు, అటునుంచి రెండు డబల్ డెక్కర్లు ఒకదానివెంట ఒకటి రావడంతో ఆగవల్సి వచ్చింది. ఆగినా రోడ్డుకి నిలువుగా పరుగు తియ్యడానికి ఉద్యుక్తుడవుతున్న సమయానికి, కండక్టరు చిచ్చిందీలా రెండోవేపునించి దూసుకవచ్చి ఆ యువకుడికి అడ్డుగా నిలబడి కాలర్ దొరకబుచ్చుకున్నాడు.

అంతే! వరాహం వచ్చి ఒకపక్క నిలబడి అతడి నడుముచుట్టూ రెండు చేతులూ బిగించేడు! (తన ఫైలు కప్పకి అందించేడు బస్సు దిగుతూనే!)

రోడ్డుమీద నడుస్తున్న జనమే కాక పాసింజరంతా చుట్టూ మూగగా, బయట పడే మార్గం తోచక ఆ యువకుడి ముఖంలో తెగింపు కనిపించింది. జేబులోంచి సరాలున మడిచివున్న చాకుతీసి దాన్ని నోటితో విప్పి, వరాహం చేతిమీద పొడవబోగా అతని చేతిమీద ఫెడేల్‌మని గొడుగు కర్రతో కొట్టేడో ప్రయాణీకుడు. చాకు నేలని పడింది.

అంతే! అందరూ ఆ యువకుడిమీదకి లంఘించేరు. ఇంక రుజువేం కావాలి? ఒకడా యువకుడి జుత్తు పట్టుక గుంజి ముఖంమీద ఫెడీమని కొట్టేడు. మరొకడు పిడికిలి బిగించి వెన్నెముకమీద పొడిచేడు. ఇంకొందరు అతడి షర్టుని పరపరా చింపిపారేసేరు. ఎవడి కిష్టమొచ్చినట్టు వాడు చెయ్యి చేసుకోడం ప్రారంభించేరు. ఇన్నాళ్ళూ జేబు దొంగల గురించి సైన్ బోర్డులు చూడ్డమేగాని ఎదురుగా చూడకపోవడంవల్ల, ఇవాళ ఎదురుగా కనపడ్డమేకాక దొరికిపోవడం వల్ల ఆ దొంగని మరి లేకుండా చేస్తే లోకంలో మరి దొంగలే ఉండరన్న మనస్తత్వం మూకకి వచ్చింది. శివాలు లెత్తిపోయేరు.

"చంపండి దొంగవెధవని" "ప్రతి దొంగ గాడిదకొడుకూ బెల్‌బాటమూ, ఎత్తుమడిమల జోడూవేసేసుకొని హీరోలాపోజుకొట్టటం... పిలుదొరగ్గానే కేటుగాడిగా మారడం!"

"ఏంరా దొంగరాస్కెల్! దుక్కలా ఉన్నావు! నీకేంపోయేకాలంరా? పని చేసుకోరాదటా?"

"ఇది బాబూ ఈనాటి యువతరం! వీళ్ళు శ్రమపడతారా? బాబులు ఆర్జించింది ఖర్చు పెడతారు! ముఫ్ఫత్తుగా తింటారు! అమ్మాయిల వెంటపడతారు!" "వీళ వల్లే మానభంగాలెక్కువయ్యేయి!" "దొరకనంత వరకూ హీరో! దొరుకుతే విలను!" "పచ్చడి చెయ్యండి ... కొడుకుని!"

ఇష్టమొచ్చినట్టు తిడుతూ, చేతికొచ్చినట్టు మూగిన ప్రజంతా కొట్టడం ప్రారంభించేరు. ఆ యువకుడి జుత్తు పీకుకపోయింది. ముఖం నించి దెబ్బలవల్ల రక్తం కారుతోంది. మెడలోని నకిలీహారాన్ని ఎవరోతెంపుకపోయేరు. చేతికున్న వాచీని మరోరు విప్పుకపోయేరు. షర్టు తునాతునకలయింది. తెల్లటిపంట్లాం నిండా మట్టిమరకలు అంటుకున్నాయి. కాని అతడు కిమ్మనలేదు నోరు మెదపలేదు. కళ్ళంట నీరు కార్చలేదు. కళ్ళలో దీనత్వం లేదు, ఈ లోకంమ్మీద క్రోధంతప్ప!

"అయ్యా! ఇదుగో ఇదేనా మీ పర్సు?" అంటూ పెద్ద వలంపటి పర్సుని ఆ యువకుడి జేబులోంచి పీకి అందించేడు ఒక ప్రయాణీకుడు.

అప్పుడా యువకుడు కోపంగా అన్నాడు... "ఎంతుందో చెప్పండి అందులో!"

"దొంగగాడిదకొడకా! ఇంకా నీ పొగరణగ లేదురా?" కప్ప తన చేతనున్న సంచీతో యువకుడి ముఖంమీద కొట్టేడు.

అప్పుడు కండక్టరు అడ్డొచ్చేడు... "ఆగండిసార్! ఆ పర్స్ తనవదని రజూ

పెయ్యండి! వింతుంది ?" వరాహాన్ని అడిగేడు.

వరాహం కాస్త ఇబ్బందిగా ఇటూ అటూ చూసి... "ఆ పర్సులో రెండు వేలుంది!" అన్నాడు.

కండక్టర్ పర్స్ అందుకొని, విప్పి చూసేడు. వందరూపాయల నోట్లు! లెక్క పెట్టేడు. సరిగ్గా ఇరవై వున్నాయి! అవిగాక రెండు రూపాయల చిల్లర నోట్లున్నాయి!

"ఎక్కడిది మీకంత డబ్బు!" దెబ్బలు తింటున్నా యువకుడు వదలకుండా అడిగేడు కసిగా.

"ఎక్కడిదా? నీ బాబు ఇచ్చేడ్రా స్కౌండల్!" ఎడాపెడా కొట్టేడు ముఖం మీద వరాహం! అతడి కళ్లలో ద్వేషం!

"దొంగతనం చేసేవ్! కూనీ చెయ్యబోయేవ్! తిరగపడతావు కూడానా!" మళ్ళా అందరూ కలియపడ్డారు. ఆ దెబ్బలకి నేల కూలేడా యువకుడు. రక్తం పెదాల నుంచి కారుతోంది. శరీరమల్లా బాధతో కంపిస్తోంది.

"ప్రావిడెంట్ ఫండ్ లోన్ పెట్టుకుంటే ఇవాళ దొరికింది! అబ్బాయికి ఒడుగు!" పర్స్ అందుకుంటూ అన్నాడు వరాహం.

ఇంతలో విషిల్ కొట్టుకుంటూ పోలీసులు వచ్చేరు, వారి వెనువెంటనే సైరన్ వేసుకుంటూ పోలీస్ పెట్రోల్ కారొచ్చింది.

# దొంగ

కండక్టర్ దొంగని అప్పగించేడు సంగతి వివరించి.

ఆ యువకుణ్ణి పట్టుకున్నారు పోలీసులు. "నేను దొంగను కాను! నేను దొంగను కాను! ఐ ఏమ్ నాట్ ఏ థీఫ్! అది మా డబ్బు!" ఆ యువకుడు ఆవేశంతో అరిచేడు. మూక మళ్ళా విజృంభించబోగా, పోలీసులు వారిని అటకాయించి, తామే నాలుగు అంటించేరు లాఠీలతో. పెట్రోల్ వ్యానులోకి కుక్కేరు. "మీరూ రండి సార్!" అన్నారు వరాహాన్ని.

"పదండి! మేం కూడా మీతో వస్తాం!" అన్నారు కొంగ, కప్ప.

ఆ యువకుడితో పాటు ఆ ముగ్గురూ పోలీస్ వాన్ ఎక్కేరు సైరన్ వేసుకుంటూ దొంగతో సహా జీపు ముందుకు దూసుకపోయింది.

అదే రోజు ఉదయం పది గంటల సమయం అప్పుడు...

* * *

వివిధ ప్రభుత్వ కార్యాలయాలు తెరుచుకున్నాయి, ప్రజలకు సేవ చెయ్యడానికి. ఎందరెందరో ఆఫీసరు, గుమాస్తాలు, గుట్టలు గుట్టలుగా ఫైళ్ళు! ఏ గుమాస్తా ఏకాగితం చూస్తాడో ఎవరికి తెలీదు. ప్రజలకీ, గుమాస్తాలకీ మధ్య బ్రోకర్లు. ఆఫీసర్లకీ గుమాస్తాలకీమధ్యఒప్పందాలు, అండర్ స్టేండింగ్‌లు.

అది ఆర్. టి. ఓ. ఆఫీసు. అక్కడ లారీలకి, కార్లకీ, మోటారు సైకిళ్ళకీ, బస్సులకీ రూట్ పెర్మిట్లు, టేక్స్ పెర్మిట్లు, ఇవ్వబడతాయి. డ్రయివింగ్ లైసెన్సులు ఇవ్వబడతాయి. రెన్యువల్స్ జరపబడతాయి. ట్రాన్స్‌ఫర్ ఆఫ్ ఓనర్‌షిప్పులు జరపబడతాయి.

ఒక సీటు ముందు కొంగ కూర్చున్నాడు. చకచకా పెర్మిట్లు తయారు చేస్తున్నాడు ఆఫీసరుగారి సంతకాలకి. మధ్యవర్తులు సంచులు పట్టుక వస్తున్నారు, వెళ్తున్నారు. డబ్బు సీటు కింద నుంచి చేతులు మారుతోంది! సాయంతం ఆఫీసు మూసేసరికి కొంగ పట్టుకున్న జిప్ సంచీ వలంగా తయారయింది పది రూపాయలకన్నా ఎవరూకొనవి ఆ పాతసంచీని ఇప్పుడు పదివందలకన్నా కొనడానికి వెనుకాడరు, అందులో ఏముందో తెలిసిన వారు!

* * *

"పదో తారీఖుకి రెండు బెర్తులు కావాలాస్సర్!"

"లేవండి!" కప్ప బెక బెక లాడేడు.

"పోనీ ఈ నెలలో ఏ తారీకున్నా ఆ తారీఖుకివ్వండి!" ఉదయం ఆరుగంటలకే వచ్చి లైన్లో నిలబడ్డ కాబోయే ప్రయాణీకుడడిగేడు.

"ఈ నెల ఏ తారీకున కూడా లేవండి!" కప్ప నిర్మోహమాటంగా చెప్పేడు.

"అలాగంటే ఎలాసార్! అర్జంటుగా వెళ్ళాలి తప్పదు! రిజర్వేషన్ లేకుండా ప్రయాణం అంటే ఏమిటో మీకు తెలీదనకనా?"

"నన్నేంచెయ్యమంటారు?"

ఆ ఆసామీకాస్త సందేహించి చిన్నగొంతుతో అన్నాడు... "బెర్తుకి పది ఉంచుకోండి!" వందకాగితం, రిజర్వేషన్ దరఖాస్తుతోసేడు.

"పదిహేనుకి తగ్గడంకాదు... పదిహేనుకి రెండు కేన్సిలేషన్స్ ఉన్నాయి! ఓకే! మీ అదృష్టం!" అంటూ వంద కాగితం తీసుకున్నాడు.

సాయంత్రం అయ్యేసరికి అతడి సంచీ పొంగింది...

* * *

"మూడేళ్ళయింది సార్ పేరు రిజిస్టర్ చేసుకొని! ఇంతవరకూ ఒక్క కాల్నా



హిందీనటుడు శత్రుఘన్‌సిన్హాకి యిటీవల కవల పిల్లలు పుట్టారు. వాళ్ళిద్దర్నీ—తల్లిదండ్రులని పై ఫొటోలో చూడవచ్చు. ఈ పిల్లలికి "లవకుశ"లని పేరు పెడతానని "శత్రుఘన్" అన్నాడట!



'చల్లాసిస్టర్స్'గా ప్రసిద్ధికెక్కిన సోదరీమణుల్లో కుమారి జయలలిత, ప్రప్రథమంగా 'భామాకలాపం'లో భామగా రంగస్థల ప్రవేశం చేసింది గుంటూరు భారతీయ విద్యాభవన్‌లో– యిటీవల కార్యక్రమంలో కుమారి జయలలిత, కుమారి శ్రీలక్ష్మి ప్రదర్శనలు యిచ్చారు.

---

రాలేదు! ఇప్పుడు అసిస్టెంట్ పోస్ట్‌లకి పేరు పంపమని ఆ కంపెనీవాళ్ళు మీకు రాసినట్లు తెలిసింది– దయచేసి పంపితే!'' ఆ యువకుడన్నాడు–

''మూడేళ్లేనా అయింది? ఆరేళ్ళూ, పదేళ్ళూ అయి రిజిస్టర్ చేసుకున్నవాళ్ళున్నారు!'' వరాహమూర్తి నిర్వికారంగా అన్నాడు.

''ఇరవై వేకెన్సీలున్నాయట సార్! బి.కామ్ వాళ్ళు కావాలని రాసేరుట! కనీసం మీరు వంద పేర్లన్నా పంపొచ్చు! మా నలుగురి పేర్లూ అందులో ఉరికించండి సార్! మేమంతా ఎం. కాం. కూడా పాసయి కూర్చున్నాం! ఆరేళ్ళక్రితం రిజిస్టర్ చేసుకున్నవాళ్ళకీసరికి ఉద్యోగాలు దొరికే ఉంటాయ్! రేపే ఆఖరుతేదీ సార్ పేర్లు మీరు పంపడానికి! పరీక్ష ఎలానూ వాళ్ళు పెడతారు! తరవాత మా అదృష్టం! మీ మేలు మరిచిపోం సార్!'' పాలిస్టర్‌షర్టు, బెల్‌బాటమ్ పంట్లాం వేసుకున్న కుర్రాడన్నాడు– ఉన్న రెండు జతల మంచి బట్టలూ తనే ఉతికి ఇస్త్రీ చేసుకుంటాడు. ఇవి చిరిగిపోతే నాన్న మరి కొత్తవి కుట్టించలేడు. చేతికున్న క్వార్ట్‌జ్ రిస్టువాచీ ఒక కలిమిగల స్నేహితుడిది. మెడలోని గొలుసు రోల్డ్‌గోల్డ్‌ది. కాలికున్న ఎత్తు మడమల జోళ్ళూ ఎరువువే. ఈ వేషం లేందే యువతరంలో తను సమాన స్థాయిలో మనలేడు! నిరుద్యోగన్న ముద్ర పడిపోయిన తనకి ఈ బట్టలు కొద్దిగా పరపతిని నిలబెడుతున్నాయి.

''ఈ లోకంలో గ్రేడ్యుయేట్లు కుక్కమురికి! దొరకంది ఉద్యోగం మాత్రం! ఎవడు చదవమన్నాడు బి. కాం...ఎం. కాం? చదువులేని లక్షలమంది ఎలా బ్రతుకుతున్నారు? మీరూ అలానే బ్రతకండి! గ్రేడ్యుయేట్ అవగానే ఉద్యోగం తే అని ప్రభుత్వపు పీకలమీద కూర్చుంటే అయిపోతుందా?'' ఫిలాసఫీ మాట్లాడేడు.

ఇంతలో ఒక మధ్యవర్తి మధ్యనదూరేడు. యువకుడ్నీ అతడి అనుచరులనీ, పక్కకి తీసుకువెళ్లేడు. మంతనాలు సాగించేడు. పేరు పంపడానికి పేరు ఒక్కింటికీ వెయ్యి! పైసలు కాదు! రూపాయలు! ఎక్కణ్నుంచి తేవడం వెయ్యి!? ఈ ఛాన్స్ పోతే వయసొకటి మీద పడిపోతోంది! మరి చాన్స్‌లు రావు! వంద ఇవ్వగలం! ఏనిమిదికి తగ్గదు! రెండొందలకన్న ఇవ్వలేం! ఆఖరికి మధ్యవర్తికి వందా, వరాహమూర్తికి ఐదొందలూ పేరుకి– యువకులు నలుగురూ అప్పు గురించి పరుగెత్తేరు. తమ డిగ్రీలను తాకట్టు పెట్టి రూపాయికీ నెలకీ పది పైసలు వడ్డీ చొప్పున డబ్బు తెచ్చేరు, చెల్లించేరు– పేర్లు వెళ్లేయి.

కాని డబ్బు తమది! ఈ వరాహమూర్తికి ఏం హక్కుంది దానిమీద? వరాహమూర్తి పర్సుని తన వీరగా పెట్టుకొని అతడి వెంట పడ్డాడా యువకుడు...!

* * *

''ఎవుడు దొంగో, ఎవుడు దొరో తెలీని మాయదారి రోజులొచ్చినయ్!'' కండక్టర్ బస్సు ఎక్కుతూ అన్నాడు!

''బాగా చెప్పేరు!'' అన్నాడు తన గొడుగు విరగనందుకు సంతోషిస్తూ, దాంతో ఆ యువకుడ్ని బాదిన ప్రయాణీకుడు!

''రైట్! రైట్!'' అన్నాడు కండక్టరు ఈల గట్టిగా వేసి–

బస్సు ముసలి లొట్టి పిట్టలా ముందుకు కదిలింది!

# హైదరాబాద్ నోట్‌బుక్

## నిఘంటు నిర్మాణంపై సంగోష్ఠి

తెలుగు అకాడెమీ తలపెట్టిన "తెలుగు శబ్ద సాగరమనే బృహన్నిఘంటువును జాతీయస్థాయిలో మహత్కార్యంగా కొనసాగించాలని జూన్ 8, 9 తేదీలలో తెలుగు అకాడెమీ నిర్వహించిన "నిఘంటు నిర్మాణంపై సంగోష్ఠి"లో పాల్గొన్న విద్వాంసులు అభిప్రాయపడ్డారు. ఈ బృహన్నిఘంటువు తెలుగు వారికేగాక భారతదేశంలోని విద్యావేత్తలకందరికీ ప్రయోజనకరం కాగలదని కూడ వారభిప్రాయ పడ్డారు. ఈ బృహన్నిఘంటువులో తెలుగు భాషా సాహిత్యాలలోని ప్రతి పదమూ చోటు చేసుకోవాలని వారు నొక్కి చెప్పారు. 1980 వరకు ప్రకటిత, అప్రకటిత రచనలనుండి పద జాలం సేకరింపబడాలని,పదజాల సంగ్రహణం పూర్తికాగానే వివిధ రంగాలలో నిష్ణాతులైన విద్వాంసులు సమావేశమై వాటి అర్థ నిర్ణయాదులకు పూనుకోవాలని వారు సూచించారు. వివిధగ్రంథాల పదకోశాలు, లిఖిత గ్రంథాలు, శాసనాలు సాంప్రదాయక శాస్త్ర గ్రంథాలు మున్నగు వాటిని పరిశీలించడం,ఆధునిక గ్రంథాలనూ అవలోకించి పదాలు, పద బంధాలు, ప్రయోగవిశేషాలనూ సేకరించడం అవసరమనికూడా తెలిపారు. మాండలిక పదాల పట్టికలను స్థిరపరచి వాటితోపాటు 'శబ్ద సాగరం' నమూనా ఆరోప పట్టికలను తయారు చేసి వాటి బాగోగులను తెలుసుకొనడానికి దేశంలోని వివిధ భాషా విద్వాంసులకు ఆ ఆరోప పట్టికలను పంపి, వారి అభిప్రాయాలు కనుగొనాలని, శబ్ద సాగరం విశ్వజనీనం కావడానికి తెలుగు ఆరోపాలను రోమన్ లిపిలోను తెలిపి, వాటికి ఆంగ్లార్థాలూ ఇవ్వాలని ఈ సంగోష్ఠి సూచించింది. ఇలాంటిమహత్తర కార్యనిర్వహణ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం ధన వ్యయం విషయంలోను, కాలపరిమితి విషయంలోను ఉదారంగాఉండాలని సంగోష్ఠి కోరింది. తెలుగు అకాడెమీ తలపెట్టిన ఇంగ్లీషు— తెలుగు నిఘంటువు తెలుగు వారికి అన్ని విధాల ప్రయోజనకరంగా ఉండడానికి సమకాలికఆంగ్ల నిఘంటువులు, ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీ ఆధారంగా రూపొందాలని ఈ సంగోష్ఠి సూచించింది. సంగోష్ఠిని 8వ తేదీ ఉదయం ఉస్మానియా విశ్వవిద్యాలయఉపాధ్యక్షులు ప్రొఫెసర్ జి. రామిరెడ్డి ప్రారంభించి, అధ్యక్షత వహించారు. ఆయన జాన్‌గంథర్ వ్రాసిన 'ఇన్‌సైడ్ ఇన్‌సైడ్'అనే గ్రంథాన్ని ప్రస్తావించి నిఘంటు నిర్మాణమనే మహత్తర కార్యంలో వివిధవిషయాలకు సంబంధించిన లోచూపు అవసరమన్నారు. ప్రారంభంలో తెలుగు అకాడెమీ డైరెక్టర్ శ్రీ జి. మనోహరరావు స్వాగతం చెబుతూ సంగోష్ఠి ఉద్దేశం వివరించారు. ప్రత్యేకాహ్వానితులైన కన్నడ—కన్నడ నిఘంటు సంపాదక వర్గం అధ్యక్షులు ప్రొఫెసర్ జి. వెంకట సుబ్బయ్య, (బెంగుళూరు), మలయాళ నిఘంటుప్రధాన సంపాదకులు డాక్టర్ వి. సి. బాలకృష్ణ (తిరువేంద్రం), హిందీ శబ్ద సాగర ప్రధాన సంపాదకుడు డాక్టర్ హర్‌దేవ్ బహారీ నిఘంటు నిర్మాణంలోని మెలకువలను,తమ తమ అనుభవాలను వివరించారు. గడియారం చూస్తూ పని చేయడం కాక, అహర్నిశం పని చేయవలసి ఉంటుందని వారన్నారు. అకాడెమీ డిప్యూటీ డైరెక్టర్ డాక్టర్ బూదరాజ రాధాకృష్ణ ధన్యవాదాలతో ప్రారంభ సమావేశం సమాప్తమైంది. భోజనానంతరం ప్రారంభమైన సంగోష్ఠి ఏక భాషా నిఘంటువుల ప్రథమ సమావేశానికి ప్రొఫెసర్ వెంకట సుబ్బయ్య అధ్యక్షత వహించారు.డాక్టర్ బూదరాజ రాధాకృష్ణ తెలుగులో వ్యాకరణ సిద్ధాంతాలు, నిఘంటు నిర్మాణం అనే విషయం గురించి, సాహిత్య కోశాలు— గురించి డాక్టర్ జి. విజయాభారతి, తెలుగు వాణిజ్య నిఘంటువు— గురించి డాక్టర్ జి. చెన్నకేశవరెడ్డి, జీవిత చరిత్ర నిఘంటువు-గురించి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు, శబ్ద సాగరం గురించి శ్రీ జి. శంకరరావు పరిశోధనా వ్యాసాలు చదివారు. ప్రొఫెసర్ వెంకట సుబ్బయ్య తమ అధ్యక్షోపన్యాసంలో ఉపన్యాసకులు చదివిన పరిశోధన పత్రాలపై వ్యాఖ్య చేశారు. తెలుగు వారు సి. పి. బ్రౌను నిఘంటువు కాలం నుంచి చాలా ముందుకు పయనించారని అన్నారు. తెలుగు అకాడెమీ వివిధ కృషిని ప్రశంసించారు. జూన్ 9వ తేదీ ఉదయం ద్విభాషా నిఘంటువులపై జరిగిన ప్రథమ సమావేశానికి నాగార్జున విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డాక్టర్ తూమాటి దోణప్ప అధ్యక్షత వహించారు. తెలుగు పద బంధకోశం— గురించి డాక్టర్ పోరంకి దక్షిణామూర్తి, ఇంగ్లీషు—తెలుగు డిక్షనరీ—గురించి డాక్టర్ ఎ. వి. పద్మాకరరెడ్డి, కాలేజి డిక్షనరీ— గురించి శ్రీ తాళ్ళూరి నాగేశ్వరరావు పరిశోధన పత్రాలు చదివారు. భోజనానంతరం జరిగిన రెండవ సమావేశానికి డాక్టర్ వి. సి. బాలకృష్ణ అధ్యక్షత వహించారు. అధికారభాష—తెలుగు పై రెండు పదపట్టికలు— అనే విషయమై డాక్టర్ ముకురాల రామరెడ్డి, సైన్సు డిక్షనరీలు గురించి డాక్టర్ ఆర్. ఎస్. ఎన్. శాస్త్రి తమ పరిశోధన పత్రాలు చదివారు. పిదప జరిగిన ప్రతినిధుల సమావేశానికి శ్రీ దేవులపల్లి రామానుజరావుఅధ్యక్షత వహించారు. డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ సంగోష్ఠి తీర్మానాలు ప్రతిపాదించారు. అవి ఆమోదించబడ్డాయి.సాయంకాలం జరిగిన ముగింపు సమావేశానికి డాక్టర్ హరదేవ్ బహారీ అధ్యక్షత వహించారు. రాష్ట్ర



నిశ్చల దృగ్గోచర కక్ష్యలో తిరుగుతూ, భూమినుంచి సమాచార ప్రసారాలను తీసుకుని తిరిగి ప్రసారం చేసేటందుకు అనువుగా భూ పరిభ్రమణం చేస్తూవుండే "ఏపిల్" అనే కృత్రిమ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి ప్రయోగించి [జూన్ 19] భారతదేశం అంతరిక్ష పరిశోధనా రంగంలో మరో మెట్టు పైకెక్కింది.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యం చిందే గట్టి పళ్ళు

# కోల్గేట్

## డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనం కాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగ తోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

***నోటి దుర్వాసనను ఆపండి...***
***కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో***
***దంతక్షయాన్ని ఎదుర్కోండి!***




DC.G.74 T

ప్రభుత్వ విద్యాశాఖ కార్యదర్శి శ్రీ మామిడిపూడి గోపాలకృష్ణన్ (ఐ. ఎ. ఎస్.) ముఖ్య అతిథిగా ఉన్నారు. నిఘంటువుల ప్రాముఖ్యం గురించి ఆయన వివరించారు. డాక్టర్ బహారీ ప్రసంగిస్తూ, శబ్ద సాగరం ప్రభావంయావజ్జాతిపై పడాలన్నారు. అది ఇదివరకు తెలుగులో ప్రచురించిన నిఘంటువు లన్నిటినీ లోగొనాలన్నారు. అకాడెమీ డైరెక్టర్ శ్రీ మనోహరరావు సంగోష్ఠి నివేదికను సభకు అందజేశారు. అకాడెమీ డిప్యూటీ డైరెక్టర్ డాక్టర్ ముకురాల రామరెడ్డి వందన సమర్పణతో సంగోష్ఠి సమాప్తమైంది. సంగోష్ఠిలో ప్రత్యేకాహ్వానితులుగా ఆంధ్ర విశ్వవిద్యాలయం భవుతిక శాస్త్రాచార్య డాక్టర్ బి. శాంతమ్మ, డాక్టర్ జి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, కుమారి ఎల్. లావణ్య సరస్వతి(హైదరాబాద్ విశ్వ విద్యాలయం,) డాక్టర్ వేటూరి ఆనందమూర్తి, డక్టర్ ర్వ శ్రీహరి, ప్రొఫెసర్ డాక్టర్ అనంత నారాయణ (ఉస్మానియా విశ్వవిద్యాలయం)— డాక్టర్ నారాయణరావు, డాక్టర్ సీతారాం (సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆవ్ ఇంగ్లీష్) శ్రీయుతులు దేవులపల్లి రామానుజరావు, తిరుమల రామచంద్ర మున్నగు వారు పాల్గొన్నారు.

**చికాగో తెలుగు మహాసభలు :**

ఉత్తర అమెరికా తెలుగు సంఘంవారు మే 23, 24 తేదీలలో నిర్వహించిన తెలుగు మహాసభలు తెలుగుదనం తొణికిసలాడుతూ కన్నుల పండువుగా జరిగాయని ఆ సభలలో పాల్గొని స్వదేశానికి తిరిగి వచ్చిన రాష్ట్ర విధాన సభ ఇంకాం సభ్యుడు శ్రీ వి. రామారావు తెలియజేశారు. సభలు ఒక హైస్కూలు భవనంలో జరిగాయని, దాదాపు ఆరువేలమంది హాజరయ్యారని, ఒక్క ఇంగ్లీషు ముక్కయినా లేకుండా అందరూ తెలుగులో మాట్లాడారని ఆయన అన్నారు.

**ముఖ్యమంత్రి హర్షం :**

శ్రీహరికోట రాకెట్ ప్రయోగ కేంద్రం నుంచి ఎస్. ఎల్. వి—3 రోహిణి రాకెట్‌ను మే 31 ఉదయం 9—33 4 నిమిషాలకు విజయవంతంగా ప్రయోగించినందుకు ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య అంతరిక్ష పరిశోధన సంస్థలో పనిచేస్తున్న శాస్త్రజ్ఞులను అభినందించారు. ప్రధాని శ్రీమతి గాంధి నాయకత్వంలో మనదేశం ఇలాటి విషయాలను ఎన్నిటినో సాధించగలదని ఆయన విశ్వాసం ప్రకటించారు. ఈ ప్రయోగం ఆంధ్రప్రదేశ్‌నుంచి జరుగడం తన కెంతో గర్వకారణమని ఆయన అన్నారు.

**సంజయ్ ఆడిటోరియం :**

మునిసిపల్ కార్పొరేషన్ కోటి 60 లక్షల వ్యయంతో సికిందరాబాద్‌లో నిర్మిస్తున్న ఆడిటోరియంకు, వాణిజ్య భవన స్తోమానికి ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య మే 29 న శంకుస్థాపనచేస్తూ, ఆడిటోరియంకు సంజయ గాంధి పేరు, వాణిజ్య భవన స్తోమానికి సరోజినీ నాయుడు పేరు పెడతానని ప్రకటించారు. పాత నగరంలో కూడ ఒక ఆడిటోరియం నిర్మిస్తామని ఆయన అన్నారు. ప్రారంభోత్సవానికి అధ్యక్షత వహించిన రాష్ట్ర మునిసిపల్ వ్యవహారాల మంత్రి శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి తమ ప్రసంగంలో సంజయ్ ఆడిటోరియంలో 1500 మంది కూర్చోవచ్చుని, దీనివల్ల సికిందరాబాద్ పౌరుల చిరవాంఛితం తీరుతుందని అన్నారు. మునిసిపల్ కార్పొరేషన్ స్పెషల్ ఆఫీసర్ శ్రీ అర్జున్‌రావు స్వాగతం చెబుతూ, పాత నగరంలో నిర్మించే ఆడిటోరియంకు, బాల భవన్‌కు కోటి రూపాయలు ఖర్చవుతుందన్నారు.

**ఉపశ్రుతి :**

"ఏమండోయ్, ఇంకా మలేషియా మత్తు వదలినట్టు లేదే?—" అన్నాను ఆమోదు గన్నులతో ఉన్న ఒక కవి మిత్రశ్రీని. "బలేగా గమనించారు. సందు దొరికిన చోటెల్లా జానీవాకర్ సీసాలు ఇరికించుకుని వచ్చారు గదా! అవన్నీ ఏం కావాలి మరి?" అని ఎదురు ప్రశ్న వేశారు ప్రక్కన ఉన్న ఒక నేస్తం.

— తిరుమల రామచంద్ర.

# బాలలూ! మీకు జోహార్లు

## పి. పద్మావతి

''రఘూ! ఊ. బస్సు స్తోంది. నిలబడు'' బలరామ్ హెచ్చరించాడు

''రేయ్!... సుందరం, అప్పన్నా, శీనూ రవి, అజయ్, శివాజీ విశ్వనాథ్, రాం, చంటి, శివాకన్నా, వెంకట్, కృష్ణా సూరీ, ఆదినారాయణా, సుబ్బన్నా, రండి... రండి'' గట్టిగా అరిచాడు రఘు.

రోడ్డుకు ఒక వారగా కూర్చుని వున్న వాళ్ళంతా లేచి వడి వడిగా రోడ్డు కుఅడ్డంగా గుమిగూడినారు. అందరికి పద్నాలుగు సంవత్సరాల వయసు నుండి పదహారు సంవత్సరాల వయస్సు వుంటుంది మొత్తం ఇరవై మంది ఉన్నారు శ్రీకృష్ణజయంతి సందర్భంలో పెరుగుముంత కొట్టడానికి చందా పోగుచేస్తున్నారు రోడ్డుమీద వెళ్లే వాహనాలను ఆటకాయించి చేతులలో వున్న డబ్బీలను మోగించిడబ్బులురాబట్టాలని శత విధాలప్రయత్నిస్తున్నారు. కొంతమందిప్రయాణికులు అమితంగా చికాకు పడుతుంటే, మరి కొంతమంది ఆ బాలల దరహాసంలోని స్నిగ్ధత్వానికి, అందమైన ఫాలభాగాన్ని స్పృశిస్తూ అలరారుతున్న జుత్తును, పాలుగారె చెక్కిళ్లను కొదమసింగంలా వీరవిహారం చేస్తున్న ఆ పసివాళ్లను చూసి ముచ్చటపడి, అబ్బురపడి, చేతికి ఎంతవస్తే అంతా వాళ్ల చేతికి ఇచ్చి వేస్తున్నారు.

అది ''టూరిసు రా'' అన్నాడు బాబ్జి. ''ఔను' అని తల వూపాడు రామకృష్ణ.

ఇంతలో ''యాత్రా స్పెషల్ బస్సు''ను పిల్లలందరూ చుట్టుముట్టడంతో ఆపడం తప్పలేదు డ్రైవర్కు

బిల బిలలాడుతూ బస్సులోనికి చొరబడ్డారు పిల్లలంతా.

''ఏం, ఏవిటా న్యూసెన్సు'' అలవోకగా, నాజూకుగా విసుక్కున్నాడు ఓ నాగరీకుడు.

తిరుపతి దేవుడికి తలలు ఇచ్చివేసిన (సారీ.. తల వెంట్రుకలు) వారంతా ఒకసారి గుండులు తడుముకొని దేశంలో సంకుచితం, దోహం, దోపిడీలు ఎలా వెరి తలలు వేస్తున్నాయో, పాపభీతి, భూతదయ మానవుడు ఎలా విస్మరిస్తున్నాడో వ్యాఖ్యానించుకుంటూ— డబ్బీ మ్రోగించుకుంటూ వచ్చిన పిల్లలను కసిరికొడుతున్న ఆభక్తులను చూచిన కండక్టరు అనుకున్నాడు —

''ఓ మహాభక్తులారా! ఎన్నో మైళ్ళు దూరంగా వెళ్ళి రాతిదేవుడికి మీ క్షణికమైన కోరికలు, తుచ్ఛమైన కోరికలు తీర్చమని నిలువుదోపిడి ఇస్తున్న మీరు ఎంత భూతదయ చూపిస్తున్నారు? కనీసం సాటి మానవుడు ఆకలని అర్థిస్తుంటే గుప్పెడు ప్రసాదం చేతిలో పెట్టని మీరు, నీతి సూత్రాలు వల్లిస్తున్నారా!'' అని

ఇంతలో ముప్ఫయ్యేళ్ళ ప్రౌఢ పిల్లలను చూడగానే వదనం ప్రఫుల్లమయింది ఆమె ప్రక్కనె గుండు తడుముకునే ఆమె భర్త వున్నాడు. తనకి సంతానయోగం లేదని డాక్టర్లు చెప్పినా పుణ్య తీర్థాలని, అవని, ఇవనీ తనవాళ్ల చేష్టలకి నిర్లిప్తంగా వప్పుకొని ఊరుకోవడం తప్ప, ఏమీ చెయ్యలేని నిస్సహాయత ఇప్పుడు ఈ పసివాళ్ళని, వాళ్ళ పాలుగారె బుగ్గలని రవి కిరణాలలా వెలిగే వారి కన్నుల్లో వెలిగె కాంతి పుంజాలనిచూచి పరవశించి వాళ్ళ చేతిలో రూపాయలు ఉంచాలని చూస్తోంది కాని భర్త చూడకూడదు చూస్తె ఇహ చెప్పక్కరేదు అతను తిరుపతి బోడిగుండులో ఒకడు. రహస్యంగా వెయ్యాలని చూస్తోంది.

ఫాలభాగాన్ని అతిక్రమించి వీపునామీదకు జాలువారుతున్న జుత్తును సుతారంగా వెనక్కు తోసుకుంటూ, స్వచ్ఛంగా అమాయకత్వానికి ప్రతీకలుగాఉండి,కనులెత్తిచూస్తున్న



గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు త్రిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది. —సం.



# బాలలూ! విూకు జోహార్లు

రఘు చేతిలో ఉన్న హుండీలో ఇంచుమించు ఒకసారిగా డబ్బులు వేసారు కండక్టరు, ఆ పడతి.

పిల్లలంతా దిగిపోయి బస్సు దుమ్ము కళ్లల్లోకి కొట్టివేస్తూ వెళ్లిపోయిన తరువాత మరలా రాబోయె వాహనానికై వేచి చూడ సాగారు. ఇంతలో దూరంగా రయ్యిమంటూ దూసుకు వస్తోంది జీపు.

హోరు మంటూ ఆ వాహనాన్ని కపిసేనల్లా విజయోత్సాహంతో చుట్టుముట్టిన పిల్లలంతా - లక్ష్మణుడిని, వేలాది కపియోధులను తన శక్తి అస్త్రాలతో మూర్ఛిల్ల జేసిన ఇంద్రజిత్తును చూచి మిగిలిన వానర సమూహమంతో చెల్లా చెదరైనట్లుగా, ఆ జీపులోని వ్యక్తిని చూడగానే అలానె అయిపోయారు.

"ఛీ! ఛీ! రోగ్స్, పనీపాటు లేకుండా అడ్డగాడిదిల్లా రోడ్డుమీద తిరగడం" జీపు హోరులో అంతకంటే కర్ణకఠోరంగా గొంతు కలిపి అరుస్తున్న జీపులోని వ్యక్తిని చూడగానే, అందరూ తొలిగి జీపుకు దారి ఇచ్చారు. జీపు వెళ్ళిన దిశగా, దిగులుగా ముఖాలు వేసుకొని చూస్తున్న పిల్లల దిశగా విప్పటి మంచో దూరంగా మంచుని ఇదంతా గమనిస్తున్న అమర్ వచ్చాడు. అమర్‌ను చూడగానే "అన్నయ్యా! చూశావా?" అని అందరూ బేలగా అడుగుతుంటే ... భుజం తట్టాడు అమర్.

అతని కంఠం నిశ్చలంగా ప్రతిధ్వనించ సాగింది.

"అధైర్యపడకండి తమ్ముళ్లూ! ధనమే ఏకైక లక్ష్యంగా, మనికోసం ఎంత నీచానికైనా పాల్పడే అధములకు మీరు కనువిప్పు కలిగించాలి. నీచం విలయతాండవం చేస్తున్న ఈ పెద్ద మనుష్యుల్లాంటి వాళ్లని, వాళ్ల చీకటి కుహరం లాంటి జీవితాల్లో, మీరు మన మాస్టారు వల్లిస్తున్న విజ్ఞాన వారధికి పునాదులు వేసి దివ్వెలను వెలిగించండి"

పిల్లలందరి వదనాలలో "దరహాసరేఖలు" అలుముకున్నాయి.

"అలాగే అన్నా!" అంటూ మరల ఉత్సాహాన్ని పుంజుకొని రాబోయె వాహనం కోసం వేచి చూడసాగారు.

# కర్ణుని రథచక్రాలు

అబ్బబ్బబ్బ! ఏమిటాబాదడం
బండ బాదడం
అవి వణి పోతూ చెమటలు చిందుతూంటే
నురుగులు కక్కుతూ, నాలుకవేలాడేస్తూంటే
అవి లాగమంటే ఏమి లాగుతాయి?
ఎంత గుర్రాలైనా వాటికీ ఒక పరిమితి వుంది
భయమూ బాధా వుంది
ప్రాణంమీద తీపీ ఉంది,
అవి కాడి కిందపారేశాయి
ముందుకు సాగనంటున్నాయి
రథం లాగనంటున్నాయి;
చక్రం అంతలోతు దిగిపోయాక
నడుంవరకు మునిగిపోయాక
పైకి రమ్మంటే ఏమొస్తుంది?
గుర్రాల్ని కొడితే వస్తుందా?
మరో మార్గంలేదు మీకు
ఇక మంచిగా కర్ణుడ్ని మరణానికి
సిద్ధంకమ్మని చెప్పండి

—దోనేపూడి రాజారావు

"అదిగో స్కూటర్ వస్తోంది" అన్నాడు అమర్.

"రేయ్! ఆ స్కూటర్ మీదవున్న వ్యక్తి మాస్టారు అన్నగారిఅబ్బాయిరా. పి.డబ్ల్యు.డి జె. ఇ గారు" అన్నాడు బలరామ్.

"ఔను. ఆయన మంచివారు కూడా. పేరు పెద్దిరాజో ఏదో గుర్తులేదు" అన్నాడు రఘు.

"ఏదోపేరు పెద్దిరాజో, పోతురాజో. రాజా మాత్రం మరరాజాలా వున్నాడు. ఆలశ్యం చేయక ఆపండి" అన్నాడు అమర్, తాను చెట్లు గుబురులోకి తప్పుకుంటూ.

తనను చుట్టుముట్టిన పిల్లలను చూచి నవ్వుతూ, స్కూటర్ ఆపాడు రాజా. వెనకాల కూర్చున్న మిసెస్ రాజా మాత్రం ... తాము పార్టీకి వెళ్ళడం, అక్కడ కన్నెపిల్లలు, గృహిణులు అయినవాళ్ళు సైతం తన భర్తను చూసి పరవశించిపోవడం అన్నీ చూపి, ముఖం ముటముట లాడించుకుంటూ స్కూటర్ మీద భర్త వెనకాలే కూర్చుని కూడా, ఆ అందమైన వొక్కుల కురుల గల అమ్మాయిని భర్త చూశాడేమో? ఆ కాలేజీలో చదివే బక్కపలచగా వున్న అమ్మాయి చలాకీగా తిరుగుతూ భర్త దృష్టిని ఆకర్షిం

చించేమో ? భర్త కూడా వాళ్ళనెవరినయినా చూశాడా ?" అని పలరకాలుగా తలపోస్తూ యోచిస్తూ కూర్చున్న ఆమె రాజు హఠాత్తుగా స్కూటర్ ఆపేసరికి తూలి పడబోయింది

తిట్టుకుంటూ విసుక్కుంటూ చుట్టూ పరికించి చూసిన మిసెస్ రాజుకు..."యశోదా పుత్రులను, రోహిణీ పుత్రులను" చూడగానే సంతోషంగా విచ్చుకున్నది ముఖం. రాజు హుండీలో డబ్బులు వేస్తూంటే తనూ వేసింది

*　　*　　*

అలా రెండు రోజులు గడిచిపోయాయి "చాలా డబ్బులు పోగు అయాయి కదూ" అంటున్న శ్రీను మాటలకు అడ్డొచ్చి...

"ప్చ్ ఏం, లాభంరా మనం జీపును ఆపి డబ్బులు రాబట్టుకోలేక పోతున్నాం" అన్నాడు సుందరం నిరుత్సాహంగా.

"ఖంగారు పడకురా అబ్బీ! ఈ రోజు జీపు ఆగుతుంది, అది ఖాయం" అన్నాడు అమర్‌తో అక్కడికి వస్తూ బలరామ్.

బలరామ్ మాటలతో ఉత్సాహాన్ని పుంజుకున్న పిల్లలు యథాప్రకారం కార్యక్రమాన్ని కొనసాగించ సాగారు

ఇంతలో అమిత వేగంగా దూసుకువస్తున్న జీపును చూచి అది తమకు సుపరిచితమైన దేనని గ్రహించారు

వీళ్ళందరినీ చేరుతుండగానే జీపు బ్రరుమని శబ్దం చేస్తూ ఆగిపోయింది. డ్రైవరు దిగి టైర్లు చూస్తూవుంటే ఫ్రంటు సీటులో వున్న శాస్త్రి మొహం గంటు పెట్టుకుంటూ, నున్నగా నిగనిగలాడుతున్న బట్టతలను, తాంబరు రోడ్డులా మెరిసిపోతున్న ఫాల భాగాన్ని నిమురుకోసాగాడు

డ్రైవర్ జీపులోకి చూస్తూ "సార్! టైర్ బరష్ అయింది" అన్నాడు.

ఆ శాస్త్రి ముఖం చిటపట లాడింది.

"సరె, అది ఏదో త్వరగా కానివ్వు" అన్నాడు వాచి చూసుకుంటూ.

"అలాగేనండి, ఈ టైరు తీసేసి వూళ్ళోకి తీసికెళ్లి పని పూర్తి చేయించుకొస్తాను" అంటూ డ్రైవర్ టైరు తీసుకొని వెళిపోయాడు.

జీపులో కూర్చున్న ఆ అయ్యవారు ఇత్తంమీద కోటీశ్వరుడు. ఎన్నో రకరకాల బిజినెస్సులు వున్నాయ్ వడ్డీ వ్యాపారం కూడా చేస్తాడు బీద ప్రజానీకాన్ని పీడించి వాళ్ళను దుఃఖమనే సంద్రావ ముంచడం ఆయనకి వెన్నతో పెట్టిన విద్య విస్సుగ్గా మాటి మాటికి వాచిలోకి దృష్టిని సారించుకొంటున్న అయ్యవారు ఒక్కసారి ఉలిక్కిపడ్డారు. ఓ కుర్రవాడు పెద్ద పెట్టునఏడుపులంకించు కుంటూ మిగతా పిల్లల దగ్గరకు వచ్చాడు.

"ఏం తిమ్మూర్తి! ఎందుకురా ఏడుస్తున్నావ్?" అడిగారు పిల్లలు ఆతంగా.

వాడు వెక్కుతూ "మాష్టారు కొట్టారని, ఇలా డబ్బు వసూలు అవి వదన్నారని" మరలా బావురుమన్నాడు వాడిని చూడగానే అర్ధమవుతుంది పనివాడని కాని వాక్కులు మాత్రం సుస్పష్టంగా ఉచ్చరిస్తున్నాడు

వింటున్న పిల్లలందరి ముఖాలలో ఆందోళన తారాడింది. "ఎలారా! మాష్టారు

బాలలూ! విూకు జోహార్లు

చంపేస్తారు బాబోయ్!'' అని అనుకుంటూ దిగులుగా ఒకరి ముఖం ఒకరు చూచుకుంటూ నిలబడి పోయారు

కుతూహలం మిన్నుముట్టగా అంతా గమనిస్తూ కూర్చున్న జీపు అయ్యవారు జీపు దిగి పిల్లల దిశగా రాసాగాడు.

తమ దగ్గరకు వస్తున్న అతనిని చూడ గానే పిల్లలు బెదిరినట్లుగా వాళ్ళలో కదలిక ప్రారంభమయింది. వీళ దరిచేరిన అయ్యవారు 'ఏమిటిగొడవ? ఏంజరిగింది?' అని ఉత్కంఠగా ప్రశ్నించేసరికి...

అందరూ రణ, గణ ధ్వనిగా జరిగింది చెప్పసాగారు. తమ మాస్టారు ఛండశాసనులు అని, ఏంత విజ్ఞాన వాహినిని నరుగులెత్తి స్తారో; అంత కఠినశిక్షణ నేర్పిస్తారని, కమ శిక్షణ ఏ విద్యార్థి అయినా దాటితే దాని పరిణామం విపరీతంగా వుంటుందని.

అంతే... ఈ అయ్యవారి ముఖం అసలే కందగడ్డ. దీనితో ఆ కందగడ్డకి కాస్త కారం గుండ పులిమినట్లు అయింది ఆయన ముఖం.

"అసలు గురువంటే ఎవరు? అసలు..." అంటూ పిల్లలందరివైపు ఓసారి చూశాడు అయ్యవారు.

ఖర్మ! లోపల ఏదో భావం వెలికి వస్తానని గుంజుకుంటూ తారాడుతోంది. కాని... ధనపతి గొంతు దాటి రాలేక పోతోంది.

"అసలు..."

అంటూ మరలా అయ్యవారు మొదలు పెట్టారు. పిల్లలందరిలో బాధపోయి "సంభ్రమాశ్చర్యాలు" నిండుకున్నాయి.

"చూడండి..."

అయ్యవారు ప్రారంభించారు. ఆయన గొంతులో కదులుతున్న భావం కాస్త లోనకు జారిపోయింది.

"మీ మాష్టారు వట్టి దుర్మార్గులులా వున్నారు. లేకుంటె పిల్లలకు విద్యచెప్పేది ఈ విధంగానా? అసలు విద్యార్థి, మాష్టారు అంటే..."

మరలా ఆ భావం ఆయన గొంతులోకి వచ్చేసింది. ఆయన నోరు కాసేపు మూసివేసి, ఆ తరువాత భావం కాస్త లోపలికి జారు కున్నాక నిట్టూర్చి, 'ఇదిగో పిల్లలూ! మీరు

చాలా మంచివాళ్ళు కనుక ఇదిగో మీకు డబ్బు ఇస్తున్నాను తీసుకోండి'' అని వాళ్ళ చేతిలో రెండు ఐదురూపాయల నోట్లు పెట్టి గిరున వెనుదిరిగి జీపు వైపుగా నడవసాగాడు

పిల్లలందరిలో ఆనందోత్సాహం మిన్ను ముట్టింది.

అప్పటికే డ్రైవర్ రావడం, టైరు బిగించడం జరిగిపోయింది. అయ్యవారు త్వరగా వెళ్ళి జీపులో కూర్చోగానే డ్రైవర్ జీపు కదిలించే ప్రయత్నంలో వుండగానే, ... పిల్లలు జీపును చుట్టుకొని వుండడం చూచి ఆశ్చర్యంతో నోరు తెరచుకొని అలానే వుండి పోయాడు

రఘు చేతిలో రెండు ఐదు రూపాయల నోట్లు రెప రెప లాడ సాగినవి

"సార్! మీరిచ్చిన ఈ సహాయానికి మెనీ మెనీ థాంక్స్'' అంటూ ఆగిపోయాడు.

"సార్! మీ పేరు చెప్పుకొని మేమంతా కృష్ణజయంతి వేడుకగా జరుపుకుంటాము'' బలరామ్ వాక్యాలు పూర్తి కాకుండానే ... సుందరం, శీనూ, విశ్వనాథ్, సూరి, వెంకట్ ముందుకు వచ్చారు.

"సార్! మేము కొట్టబోయేది పెరుగు ముంతను కాదు. మీలాంటి వాళ్ళలో కూరుకు పోయిన అజ్ఞాన పశువును. మేము ఏరుకొనేవి డబ్బులు కాదు విజ్ఞానమనే గుళికలను'' అంటూ అందరూ కోరస్‌గా పలకసాగారు.

ఇంతలో రఘు స్వరం ఖంగుమంది.

"సార్! మా మాష్టారు గురించి మీరు పొరబడ్డారు. మా గురువు, జగద్గురువు. మాకు దైవం,గురువు, అన్నీ మా మాష్టారే. ఇహ వెళ్ళండి సార్'' అంటూ అడ్డు తొలిగాడు

డ్రైవర్ నోరు యధా ప్రకారం ముకుళించుకొన్నది. అయ్యవారు మాత్రం శిలాకృతి దాల్చినట్లుగా వున్నారు. మెల్లిగా కదలిక ప్రారంభమయినది ఆయనలో.

"హమ్మా, హమ్మా, వీళ్ళు పిల్లలా? పిడుగులు. అవి చూపులా? గుండె లోతుల్లోకి పెకలించుకు వెళ్ళే నిశిత పిడి బాకులు. అవి మాటలా? కాదు కాదు. నిశిత శరములు.'' అనుకుంటూ డ్రైవర్‌ని మందస్వరాన్న జీప్‌ను స్టార్ట్ చెయ్యమన్నాడు

కాని అసలు సంగతి అయ్యగారికి తెలియదు పాపం! అందులో డ్రైవర్ స్థానం కూడా వున్నదని, జీపు టైరు బరస్ట్ అవడం నాటకమని, పైగా గురువింద సామెతగా ఒకరి లోపాలు ఎత్తిచూపితే ఆ బలహీనతకు లొంగి ఏంతటి ఉపకారమయినా అయ్యవారు వెనుకంజ వేయరని డ్రైవర్ సూచించడంతో ఇలాంటి వ్యూహం పన్నినారని తెలియదు పాపం!

అమర్ వీళ్ళను సమీపిస్తూ "ఇలాంటి బాలలే రేపు ప్రగతి భారత భవితవ్యానికి అఖండ జ్యోతులు! "బాలలూ! మీకు జోహార్లు'' అనుకున్నాడు మనస్సులో.

### అంకితం

"నా ప్రియమైన స్వామి శ్రీనివాసుడికి భక్తితో అంకితం.''

—రచయిత్రి

---

## ఈ ఆట నేర్చుకోండి!



సన్నంగా, గుండ్రంగా వుండే గజం లేక గజంపావు పొడవుండే కర్ర తీసుకొచ్చి ఆటస్థలంలో పాతిపెట్టండి సుమారు ఓ అడుగున్నర వ్యాసార్థం వున్న చక్రం చుట్టండి బొమ్మలో లాగ! ఆ కర్రని ఈ గీసిన గిరిలో పాతిపెట్టండి. ఆ కర్రమీద ఓ పది పైసల బిళ్ళ పెట్టండి. ఈ ఆటలో పాల్గొనే పిల్లలు గిరికి ఓ రెండు గజాల దూరంలో లైనుగా నిలబడాలి. కర్రమీదున్న పది పైసల నాణాన్ని మరో పదిపైసల నాణెంతో ఎగరకొట్టాలి (గుట్చాట ఆడినట్టు) కర్రమీదున్న నాణెం ఎగిరి వృత్తాకారంలో వున్న గిరికి అవతల పడాలి ఆ నాణెం సున్నాలోనే పడిపోతే పాయింట్ లేనట్టే! గిరి అవతలపడితే ఆటగాడికో పాయింట్. నాణాన్ని, చక్రం అవతలపడేటట్టు కొడుతూ వుంటే పాయింట్లు వస్తాయి. ఒక బాలుడు ఛాన్సు పోగొట్టుకుంటే, రెండో వాడాడాలి. ఎవరికెక్కువ పాయింట్లొస్తే వాళ్ళు గెల్చినట్టు. ఈ ఆట "బెజిల్'' దేశంలో బాల బాలికలంతా విపరీతంగాఆడతారు. [★★★]

---

## కోతి చేష్టలు!

భారత చరిత్రలో ఇది కిష్కింధాకాండ
కోతులకు రాజ్యాలిచ్చిన కాండ
రామరాజ్యానికి కావాలంటూయి, మా అండ
వేసేస్తున్నాయి శాంతికి నెత్తిపై బండ
చేసేస్తున్నాయి న్యాయం జరగకుండా
జరుగుతున్నది ఘోర దమనకాండ
న్యాయానికి నిలువనీడ లేకుండా
మానానికి మనుగడ సాగకుండా
మరిఎన్నాళ్ళీ కిష్కింధకాండ?

— చిపుకుల రామేశ్వర్

# బైస్కోపు బాతాఖానీ

— వీరాజీ

## విశ్వనాథ్ "సప్తపది"



"రాజును చూసిన కళ్ళ మొగుణ్ని చూస్తే మొత్త బుద్ధి" అన్నట్లు 'శంకరాభరణం' చూసిన కళ్ళతో మరో విశ్వనాథ్ సినిమా చూసినా అది "ఆనదు"— అంటున్నారీమధ్య... కాని సప్తపది అట్లా కాదు. 'కళాత్మక'మై, 'కమనీయ'మై చూసేవాడి హృదయాన్ని నేరుగా, మెత్తగా తాకుతుంది! గ్రీష్మతాపం తర్వాత తొలకరి జల్లు లాగ వుంది. శరీరాల "రాపిడి"మాత్రమే 'ప్రేమ' అన్న మలిన శృంగార సినిమా కథలతో విసిగెత్తిన వాళ్లకి "సప్తపది" సినిమా హాయిగా వుంది!

'శంకరాభరణం' అంత 'సక్సెస్' అవడానికి కారణం ఏమిటి? 'క్రాసూ' — 'మాసూ' అన్న వూసు లేకుండా అది అందర్నీ లాక్కుందెందుకని?— యీ ప్రశ్న యెక్కడో ప్రవాసాంధ్రలో భిలాయి ఆంధ్రులు కొందరు నన్ను గుచ్చి అడిగారు— "అది "ప్రేమ" కథ— అందరికీ నచ్చుతాయి "ప్రేమకథలు" అని అర్థంటుగా సమాధానం చెప్పాను— కాదు శంకరాభరణం ప్రేమకథే... "ఇద్దరూ దొడ్లుతూ పార్కులో డ్యూయెట్ పాడుకుంటే తప్ప ప్రేమ కాదా!?"

'సప్తపది' కూడా ప్రేమకథే — ప్రతీ 'ప్రేమ' సన్నివేశం, చివరి సన్నివేశం దాకా కూడా చక్కగా 'పురి'కడిగిన ముత్యం లాగా తీర్చి దిద్దుకున్నాడు కాశీనాధుని విశ్వనాథ్ — అతనికి అతని 'టీము'కీ ప్రత్యేకించి 'కస్తూరి' ఫొటోగ్రాఫీకి తెలుగు దేశంలోని ఉత్తమాభిరుచిగల ప్రేక్షకులు "ఓహో" అని ప్రశంసలు అందిస్తారు. అనుమానం అక్కరలేదు—

"యాజు"లు [జె. వి. సోమయాజులు] అతని కొడుకు "అవధాని" [రమణమూర్తి] అవధాని కొడుకు గౌరీనాథ్ [రవికాంత్] నిజంగా మూడు తరాల 'బ్రాహ్మలు'— 'యాజులు'— గజ్జెకట్టి గడపదాటిన తన కూతుర్ని—నాట్యాచార్యుని అర్ధాంగి అయిన నేరానికే, వొదులుకుంటాడు — అతని కొడుకు; మేనకోడల్ని— ప్రఖ్యాత 'నర్తకి'గా తన గ్రామానికి వొచ్చిన 'హేమ'ని — 'బంగారం' అంటూ స్వీకరిస్తాడు!— ఇక— 'మడి' బట్టలు 'తడి' బట్టలు, యింట్లో "అమ్మా" గుళ్లో "అమ్మవారూ" తప్ప ఏ లోకమూ పాడూ యెరుగడు అనుకున్న గౌరీనాథ్ యిందర్నీ మించిన లోకోత్తరమైన త్యాగాన్ని లోకకళ్యాణాకాంక్షని— చూపించి తను తాళి కట్టిన హేమను—ఆమె అదివరకే మనసులో పెట్టుకున్న వేణుగాన విద్వాంసుడైన హరిజన యువకుడికి అప్పగించేస్తాడు—

కులవ్యవస్థకి, మత మూఢాచారాలకి బ్రాహ్మలే అసలు కారణం అనేవాళ్లు— గడచిన శతాబ్దకాలంలో మన సాంఘిక చరిత్రని ఒకసారి "తడిమి" చూస్తే మళ్లీ యీ "అనాచారాన్ని" "అంటరానితనాన్ని" "కులవ్యవస్థని" తమ తప్పు గ్రహించి— స్త్రీజనోద్ధరణ ప్రాతిపదికగా పునరుద్ధరించిన "మంచి బ్రాహ్మలు" ఆంధ్రదేశంలోను, అఖిల భారత దేశంలోనూ కూడా చాలా మంది కనబడతారు!

"యాజులు" చివరలో తనయింటికోడల్ని— ఆమె ప్రియుడి కప్పగించడాన్ని శాస్త్ర సమ్మతంగా సమర్థించడం చూసిన ప్రేక్షకులు— "ముసిలాడు గట్టిగా రాజీ పడ్డాడు—పైగా యెప్పుడూ" "ఆ వెధవ శ్లేష"లతో జనాల్ని చంపేవాడు [కొడుకు మాటల్లో] నిట్ని అరమరికలూ లేకుండా 'రాజీ పడ్డాడు" అంటూంటే వెనన్నాను — ఆత్మహత్యకన్నా "ఉరిశిక్షే" మేలు అనుకున్నాడేమోనని— ఐతే "యాజులి"[పాత్ర] పాయింట్ ఆఫ్ వ్యూలో సరదాకన్నమాట అది—కాని యీ "మార్పు" మహనీయమైనది!

కులవ్యవస్థ మీద ఒక్క "బ్రాహ్మ"లను మాత్రం అగ్రవర్ణంగా బోనులో నిలబెట్టి శిక్ష వేస్తున్న కాలంలో; యీచిత్రం అట్టి కులవ్యవస్థ మీద ఒక గొడ్డలిపెట్టు — "కర్మ ఖండాలురై పోతున్న బ్రాహ్మణ్యం కన్నా జాతి ఖండాలురే వెయ్యిరెట్లు మిన్న" అని గట్టిగా అన్న విశ్వనాథ్ తెలుగు సినిమారంగం గర్వించదగ్గ గట్టివాడు! అయితే చివర ఒక హరిజనుణ్ని "అయినింటి" కుర్రాడే వెతికి తెచ్చి సొంత యిల్లాల్ని అప్పగించి యిచ్చేస్తూంటే — పూరంతా అడ్డం వచ్చి యెదురు నిలుస్తుంది — అక్కడ ప్రశ్నార్థకం పెట్టి [సీను స్క్వీజ్ చేసి] ప్రేక్షకుల మనస్సులకి వదిలేస్తేనో? అనడిగిందో యిల్లాలు! అవును దానివల్ల — అనుకోకుండా "వివాహ వ్యవస్థ"కు యీ చిత్రంలో చివర తగిలిన దెబ్బ తగలకపోను—కాని యిది కాగితం మీద కథకాదు. లక్షలు పోసి తీసే వెండితెరబొమ్మ—దానికో స్పష్టమైన ముగింపు యివ్వాలి — అంచేత చిత్రాన్ని "అవతలి వొడ్డు"కి తీసుకుపోయాడు దర్శకుడు—అది అతని "కథ" — ముందుతరానికి చెందిన "మిర్చి గరిటె"లావున్న ఒక "వటువు" యిది చూసి హర్షిస్తూ చప్పట్లు కొడతాడు— యిక్కడే విశ్వనాథ్ "మీతరం కాకపోయినా మీ తరువాతి "తరం" "సంప్రదాయం" పునాదిమీదనే నిలబడి యీ "ప్రగతి" మార్గాన్ని హర్షిస్తుంది సుమా!?" అంటూ చిత్రాన్ని ముగించాడు. చిత్రం చూసినవాళ్ళకి యీ నా 'సొదంతా' అరటిపండు వొల్చినట్లు అర్థమైపోతుందనుకుంటాను — 'అగ్ర

తాజా వార్తలకు, వ్యాఖ్యలకు, కొంగ్రొత్త ప్రత్యేక శీర్షికలకు ఆంధ్రపత్రిక దిన పత్రిక పెట్టింది పేరు...మీరు మీ కాపీ మీ ఊరి ఏజెంటుద్వారాగాని లేదా మానేజరు, గాంధీనగరం, విజయవాడ-3 లేదా మానేజరు, బషీర్ బాగ్, హైద్రాబాద్-29 కి గాని వ్రాసి పోస్టులో తెప్పించుకొనండి.

# ఆంధ్రప్రదేశ్ లో రైతులకు చేయూత



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

రైతు మన ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక. శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం రైతుల ఆర్థిక అభ్యున్నతికి అనేక చర్యలు తీసుకున్నది.

**రుణాల చెల్లింపుగడువు పునర్నిర్ణయం**

1980 జూన్ 30వ తేదీ నాటికి సహకార పరపతి సంస్థలకు రైతులు బకాయిపడ్డ రుణాల వసూళ్ల విషయంలో కాల వ్యవధిని పునర్నిర్ణయించారు

**అసలు మొత్తం :**

సాధారణ రుణం : మధ్యకాలిక (మార్పు చేసిన) రుణ వాయిదా.

మధ్యకాలిక (పునర్నిర్ణయాక). రుణ వాయిదా

మూడు సంవత్సరాల రుణంగా పునర్నిర్ణయం సాధారణ రుణంతో కలుపుకొని సగటు రుణం మొత్తం 5 సంవత్సరాల రుణంగా పునర్నిర్ణయించబడి సాధారణ, మధ్యకాలిక (మార్పుచేసిన) రుణాలతో సహా మొత్తం రుణాన్ని 7 సం. రుణంగా పునర్నిర్ణయించబడింది.

**వడ్డీ :** ఒక సంవత్సరానికి వడ్డీ బకాయి : ఒక సంవత్సరంపాటు వాయిదా వేశారు.

రెండు సంవత్సరాల వడ్డీ బకాయి : రెండు సంవత్సరాల గడువు పెంచారు.

మూడు సంవత్సరాలు, అంతకుమించిన కాలానికి వడ్డీ బకాయిలు : మూడు సంవత్సరాల పాటు వ్యవధి పెంచారు.

మొత్తంమీద గడువు పొడిగింపు మూడు సంవత్సరాలకు మించకుండా దీర్ఘకాలిక రుణాలను రుణం కాల వ్యవధితోపాటుగా బకాయిపడ్డ వాయిదాల సంఖ్య మేరకు తిరిగి చెల్లించడానికి గడువు పెంచారు.

**పంట రుణాలు :** 1980 ఖరీఫ్ కాలంలో సహకార బ్యాంకులు రికార్డు స్థాయిలో రు 82 కోట్ల మేరకు పంట రుణాలను రైతులకు మంజూరు చేశాయి.

75 శాతం సహకార బ్యాంకు రుణాలను 5 ఎకరాల మాగాణి లేదా 10 ఎకరాల మెట్ట భూమిగల రైతులకు మంజూరు చేస్తారు ఇందువల్ల చాలావరకు బలహీన వర్గాలకు లాభం కలుగుతుంది. ఇందులో మూడవవంతు మొత్తాన్ని షెడ్యూలు కులాలు, షెడ్యూల తెగల వారికి కేటాయిస్తారు.

**దీర్ఘకాలిక రుణాలు :** రాష్ట్ర సహకార వ్యవసాయ అభివృద్ధి బ్యాంకు ప్రస్తుత సంవత్సరంలో రు. 65 కోట్ల మొత్తాని భూముల అభివృద్ధి, బావుల త్రవ్వకం, తోటలు. గొర్రెలు, కోళ్ళ పెంపకం పథకాలకు కేటాయించింది

**రుణాల వసూళ్ల నిలిపివేత :** కరువు బాధిత ప్రాంతాలలో రుణాల బకాయిలు, సెస్సులతో సహా భూమి శిస్తు వసూళ్ళను ప్రభుత్వం నిలిపివేసింది.

**పంటల భీమా :** వరి, జొన్న, వేరుశనగ పంటలకు పంటల భీమా పథకాన్ని ప్రవేశ పెట్టారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధ శాఖచే ప్రకటితము. D.I.P.R. No. 23120 Advt Cl-3/81

## బైస్కోపు బాతాఖానీ

వర్మం'గా యాజులు 'జాగా'లో రాజులుని [అద్భుతంగా పోషించాడీ పాత్రని అలు] పెట్టి 'మాస్తే' (శారీ) ఆలోచిస్తే ఎలా వుంటుంది?- 'విశ్వనాథ్' గురించే అంతా చెప్పి-నటీనటుల గురించి ఏమీఅనకపోవడం తప్పు కాదా! చివరికి ఆ గోవుల గొవన్న, వాడి తమ్ముడు "ఎందువలన"? "ఎందువలన"? అంటూ ముద్దుమాటలాడే చిన్నారి 'వెర్రి యాదవు'డిదాకా అందరూ "అందరే"- శభాష్!

### శంకరాభిషేకమా!?
### ప్రేమాభిషేకమా?

ప్రేమాభిషేకం చిత్రం— ఈ మధ్య కాలంలో ఏ చిత్రానికి లేనంత హైకాన్ని చేసింది— ప్రేక్షకులింకా యీ చిత్రాన్ని చూస్తున్నారు అక్కినేని యింటర్‌వెల్ దాకా ఒక తరాన్ని— ఆటు తరువాత మరో తరం అభిమానుల్ని తన్మయుల్నిగా తన నటనతో అభిషేకం చేస్తే— దాసరి రాసిన పాటలకి చక్రవర్తి, బాలూలుకూడా అందుకు తీసిపోని తపస్సు ధారపోయడంతో చిత్రం కమనీయమై, శ్రవణపేయమై, కళాఖండమై అఖండ కీర్తి ఆర్జించింది! విజయవాడలో మున్నెన్నడూ ఎరుగనంతటి ఘనంగా ఎన్. టి. ఆర్., ఏ. ఎన్ ఆర్. లు అపూర్వంగా కల్సుకుని వేడుకలలో పాల్గొన్నారు. 'దాసరి' పేరు విజయానికి మరోపేరై పోయింది" "ఒక్క తెలుగులోనే కాదు అఖిల భారతంలోనే" అంటాడు హీరో జితేంద్ర-కరెక్ట్.



### గమనిక

పాఠకులు పడ్డ వంటలే పడితే "ఎప్పుడూ అవే" వంటలా? అంటారు. కనుక 'వంటలు' పంపే వారు ఓసారి పాత సంచికలు తిరగేసి అందులో లేనివి వ్రాసి పంపమని—సాధ్యమైనంత క్లుప్తంగా వ్రాయమని మనవి.

సం.



## ఉత్తరాలు

[5వ పేజీ తరువాయి]

### సీరియల్

26—6—81 సంచికలో "కల్చర్" కథ నిజంగా చాలా బావుంది. మోహమాటానికి ఇంగ్లీషు సినిమాకు పోయిన పాపం ఆ దంపతుల పాట్లు చదువుతుంటే నవ్వువచ్చింది. 'రాగజ్వాల' బాగా నడుస్తోంది. రమ్య, శ్రీకాంత్‌ల కొత్త కాపురం ముచ్చట్లు సరదాగా ఉన్నాయి. థాంక్స్ టు చిట్టారెడ్డి.

పుటికాన ప్రకాష్ (విజయనగరం)

### కథలు

26—6—81 సంచికలో మల్లాదిరచన అనగానే ఆశగా చదివాను. "రెండు దృశ్యాలు" కథ. భరించలేని నిరాశ కలిగింది. ప్రాచుర్యం ఉన్న రచయిత రాసింది కనక వేసుకున్నట్టుంది కథ.

టి. నీహారిక (ఖమ్మం)

* * *

26—6—81 సంచిక పద్మాలన్నా ముఖ చిత్రం ఏమంత రసవత్తరంగా లేదు. "బకాసురుడి రేషన్‌కార్డు" కథ వండర్‌ఫుల్‌గా ఉంది. నేటి సంఘ దుస్థితి చక్కటి రచనాశైలిలో మలిచారు. వారికి నా కృతజ్ఞతలు.

అనుముకొండ నాగమల్లేశ్వరరావు (మచిలీపట్నం)

### పులిచింతల

26—6—81 తేదీ వారపత్రికలోని "హైదరాబాద్ నోట్‌బుక్" శీర్షికలో సుప్రసిద్ధ యింజనీరు డాక్టరు కె. ఎల్. రావు "రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలలో, నిరంతరం సంభవించే కరువు కాటకాలను తొలగించడానికి కృష్ణానదికి జగ్గయ్యపేట సమీపంలోని పులిచింతల వద్ద జలాశయం నిర్మిస్తే తప్ప రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలు సస్య శ్యామలం కావని అన్నారని" వ్రాశారు.

పులిచింతల దగ్గర జలాశయం నిర్మిస్తే కృష్ణానదికి యెడమ వైపున హుజూర్‌నగర్ తాలూకా (నల్గొండ జిల్లా) కొంత భాగము మిగతా కృష్ణా జిల్లా నందిగామ, తిరువూరు తాలూకాలకు నీరు లభిస్తుంది. కుడివైపున గుంటూరు జిల్లాలోని తాలూకాలకు సేద్యపు నీరు లభిస్తుంది. మరి రాయలసీమకు తెలంగాణాకు నీరు ఎట్లా లభిస్తుందో అర్థం కావడంలేదు. అదీ గాక పులిచింతల జలాశయం నిర్మిస్తే సాగయ్యే భూములు యిప్పుడు నాగార్జునసాగర్ కుడి ఎడమ కాలువల నీటి ద్వారా సాగులోకి వచ్చాయి. కాబట్టి పులిచింతల దగ్గర జలాశయము నిర్మాణం రాయలసీమ తెలంగాణా ప్రాంతాల అభివృద్ధి గురించి వివరణ ప్రచురిస్తే బాగుంటుందని భావిస్తున్నాను.

ఆర్. కె. ఎస్. ఐ. వల్లి (ఖమ్మం)

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street
Gandhinagar, Vijayawada-3




ఈ రోజుల్లో తలనొప్పి అంటే
మాటలా!

సాలోఫేన్ ను వాడండి.
అమోఘంగా నొప్పులను నివారించే
విశిష్టమైన మాత్ర.
వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి, ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.
సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—వీళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

సాలోఫేన్
అమోఘమగు
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి